sunday magazine

# ఆదివారం ఆంధ్రజ్యోతి

12 మార్చి 2017



## 7 గ్రహాలు ఎన్నెన్నో ఆశలు...

ఫిల్మ్ నగర్

# రంగ్ బర్ సే...

**తళతళలాడే తెల్లటి దుస్తులు ధరించి, హీరోహీరోయిన్లు రంగులతో సయ్యాటలాడుకునే సీన్లు తెర నిండుగా చాలా సినిమాల్లోనే కనిపిస్తాయి. 'రంగ్ బర్‌సే' నుంచి 'బలమ్ పిచ్‌కారీ' దాకా సూపర్ హిట్ 'హోలీ' సాంగ్స్‌కు లెక్కే లేదు. కేవలం తెర మీదే కాదు తెర బయట కూడా స్టార్లు 'హోలీ'ని ఘనంగా జరుపుకుంటారు. నేడు (12 మార్చి) హోలీ సందర్భంగా వారేమంటున్నారో చూద్దాం...**

## రౌడీగ్యాంగ్‌తో సందడి

**హోలీ** వచ్చిందంటే నేను చేసే సందడి అంతా ఇంతా కాదు. మాకొక రౌడీ గ్యాంగ్ ఉంది. ఆ గ్యాంగ్‌తో కలిసి రోడ్డు మీద పడిపోవడమే. ఫ్రెండ్స్ ఇళ్లకు వెళ్లి వారిని దొరకబట్టి రంగుల్లో ముంచడం భలేగా ఉంటుంది. అయితే రసాయన రంగులను నేను తీవ్రంగా వ్యతిరేకిస్తాను. అవి చర్మానికే గాక పర్యావరణానికి కూడా హాని చేస్తాయి. అందుకే సేంద్రీయ రంగులతో, చక్కని సంగీతంతో హోలీ జరుపుకుంటే అందరికీ మంచిది.

**- రిచా చద్దా**

## గులాల్ చల్లుకోవడం బాగుంటుంది

**గుప్పిట** నిండా గులాల్ పట్టుకుని ఫ్రెండ్స్ వెంటపడి దొరకబుచ్చుకుని ఒక్కసారిగా వారిని రంగుల్లో ముంచడం మజాగా ఉంటుంది. అయితే ఈ మధ్య చాలామంది రంగుల కన్నా నీటితో ఎక్కువగా హోలీ ఆడుతున్నారు. అసలే ఎండాకాలం... నీటి సమస్య విపరీతంగా ఉంటోంది కాబట్టి రసాయన రంగులతో కాకుండా గులాల్ వంటి వాటితో ఆడితే హోలీ ఇంకా బాగుంటుంది. హోలీనాడు తినే 'గుజియా' మిఠాయి నాకు చాలా ఇష్టం. 'రంగ్ బర్ సే' పాట హోలీ జాతీయగీతంగా మారింది.

**- కృతి సనన్**

## రంగులంటే భయం...

**నాకు** అస్సలు నచ్చని పండగ హోలీ. రంగుల్లో మునిగి తేలడమంటే నాకు భయం. కానీ తప్పదు కాబట్టి నా వరకు నేను ఒక బాక్సులో కొద్దిగా ఆర్గానిక్ గులాల్ తీసుకుని నా సోదరి, ఆప్తమిత్రులపై చల్లుతా. వాళ్లంతా మ్యూజిక్ పెట్టుకుని పిచ్చిపిచ్చిగా రంగులు చల్లుకుంటుంటే ఒక పక్కన కూర్చుని ఎంజాయ్ చేస్తా. ఆ రోజు సాయంత్రం మాత్రం ఫ్యామిలీ ఫ్రెండ్స్‌తో రెస్టారెంట్‌కో, సినిమాకో తప్పకుండా వెళ్తా.

**- తాప్సీ పన్ను**



## హోలీకి ఒకరోజు ముందు...

**హోలీకి** ముందురోజు రాత్రి నా తలకు కొబ్బరినూనె పట్టిస్తా. అలాగే శరీరానికి మాయిశ్చరైజర్లు, సన్‌స్క్రీన్ లోషన్ అప్లయ్ చేసి ఆ తర్వాతే బయటకు వెళ్తా. ఇలా చేస్తే రంగులు వెంట్రుకలకు, శరీరానికి అంటుకోవు. ఆ తర్వాత నీళ్లతో సులువుగా శుభ్రం చేసుకోవడానికి వీలవుతుంది. సినిమాల్లో కూడా హోలీ ఆడిన సందర్భాలు అనేకం ఉన్నాయి. వాటిల్లో 'యే జవానీ హై దివానీ'లో 'బలమ్ పిచ్‌కారీ' సాంగ్ కోసం నేను, రణ్‌బీర్, కల్కి కొచ్చిన్ రంగుల్లో మునిగితేలాం. ఆ పాట నాకు ఆల్‌టైమ్ ఫేవరెట్.

**- దీపికా పదుకొనే**

INSIDE





**ఏడు గ్రహాలు... ఎన్నెన్నో ఆశలు**

'ట్రాపిస్ట్-1' నక్షత్రం చుట్టూ తిరుగుతున్న సప్త పృథ్వీ మండలంలో జీవం ఉందా? ఖగోళ శాస్త్రవేత్తలతో పాటు యావత్ ప్రపంచానికీ ఆసక్తి రేకెత్తిస్తున్న విషయమిది. 8



**సంకల్ప్ రెడ్డి**

ఇంజనీరింగ్ చేసి పై చదువుల కోసం ఆస్ట్రేలియాకు వెళ్ళిన ఆ కుర్రాడికి సినిమాలపై ఆసక్తి కలిగింది. అతడి ఐదేళ్ల కృషితో 'ఘాజీ' తెరకెక్కింది. 12



# మిత్రవాక్యం

ఒక ఊరు ఉంది. ఆ ఊరి జనానికి కావాల్సినవన్నీ ఊర్లోనే దొరుకుతాయి కాబట్టి ఎవరూ పెద్దగా బయటికి వెళ్లేవాళ్లు కాదు. కొంతకాలానికి వాళ్లకు కావాల్సిన వస్తువుల సంఖ్య పెరిగింది. బయటి నుంచి ఎవరో ఒకరు వాటిని తెచ్చి అమ్మడం మొదలుపెట్టారు. అయినా ఏదో ఒకటి లేదనే అసంతృప్తి పెరుగుతూ పోయింది.



అప్పుడొకాయన మూడు గొర్రెలు తీసుకొచ్చి వాటిమీద 1, 2, 4 అంకెలు వేసి ఊర్లో వదిలిపెట్టాడు. అందరూ వాటిని చూశారు. ఎన్నిసార్లు చూసినా మూడో అంకె ఉన్న గొర్రె మాత్రం కనబడడం లేదు. అందరికీ ఆసక్తి పెరిగింది. టెన్షన్ వచ్చేసింది. ఊరంతా వెతికారు. పనిలేని వాళ్లే కాదు పనులున్న వాళ్లు కూడా పనులు మానేసి వెతికారు. కాని ఆ గొర్రె కనిపించలేదు. ఎందుకంటే అది లేదు కాబట్టి. మనలో చాలామంది ఆ ఊరి జనం లాంటి వాళ్ళమే. ఉన్న దానితో సంతృప్తి చెందకుండా లేని దాని కోసం ఉన్న ఆనందాన్ని పోగొట్టుకునేవాళ్లమే. ■

## ప్రియమైన 'ఆంధ్రజ్యోతి'కి...

### ◆ అబ్బా... ఆ రుచే వేరు!

'కూరేం వండావే అవ్వా' అనగానే... 'గోంగూర తొక్కు, నూరాను రా..' అనేది మా అమ్మమ్మ. ఆ మాట వినగానే నోట్లో నీళ్ల ఊరేవి. ఒక్కోసారి బడి నుంచి ఇంటికి వచ్చేసరికి మా అమ్మ రెండు ఎల్లిపాయలను, నాలుగు పచ్చి మిరపకాయలను ఇంత ఉప్పు వేసి రోట్లో నూరి అన్నంలో కలిపి పెట్టేది. అబ్బా.. ఆ రుచే వేరు. ఆ చిన్ననాటి జ్ఞాపకాలను గుర్తుకుతెచ్చింది ఈ వారం కవర్‌స్టోరీ. పద్నాలుగు రకాల రోటి పచ్చళ్లు ఉన్నాయని తెలిసాక... ఇన్ని రోజులూ నాలుక ఇంత రుచిని మిస్ అయ్యిందా... అని బాధేసింది. ఈ తరానికి ఆనాటి రోటి పచ్చళ్ల రుచులను పరిచయం చేసినందుకు వాసిరెడ్డి వేణుగోపాల్ గారికి ధన్యవాదాలు.

**- పాపికొండయ్య,** వరంగల్లు

### ◆ ఈ 'మరక' మార్పు కోసం!

ఈ వారం కథ 'మరక మంచిదే' ఎన్నో ఆలోచనలను రేకెత్తించింది. పొత్తి కడుపు పట్టుకుని నేనేడుస్తుంటే.. వయసు వచ్చిందని, ఒద్దికగా ఉండమని వడ్డించారు పెద్దవాళ్లు. అక్కకు ఏం జరిగిందో తెలుసుకోవాలని మా తమ్ముడు ప్రయత్నిస్తే... చెప్పారా... ఊహూ. ఆడవాళ్ల మనోభావాలను చక్కగా రాశారు రచయిత్రి.

**- పావని,** కొంపల్లి

### ◆ అవగాహన పెంచాలి

'మరక మంచిదే' కథ బాగుంది. ఆడపిల్లల్లో 'పీరియడ్స్' గురించి సరైన అవగాహన కలిగించడం చాలా అవసరం. దేహంలో జరిగే ఒక మార్పు గురించి వారికి అవగాహన పెంచాలే తప్ప అదేదో అంటరానిది, అసహ్యమైనది అన్నట్టుగా చూడకూడదు. ఆడవారికి ప్రకృతి కలుగజేసిన ఒక అదనపు బాధ్యత అది అని బోధించాలే కాని శారీరక బాధ అనే స్పృహ కలిగించకూడదు.

**- నారుమంచి సుబ్బలక్ష్మి,** ఈమెయిల్

### ◆ గ్రేట్ 'బ్యాంక్స్'

'తల్లిపాల బ్యాంకులు' కథనం చాలా బాగుంది. ఏ కారణం చేతనయినా పాలు ఇవ్వలేని తల్లులకు ఇదొక వరం. ఇలాంటి బ్యాంకులను మరింతగా పెంచితే తల్లిపాలు లేక పిల్లల్లో వచ్చే వ్యాధుల సంఖ్య తగ్గిపోతుంది.

**- సరిత,** హైదరాబాద్

### ◆ నిండుగా ఉంది

'అమ్మకు ప్రేమతో' కథనం మనస్సును కదిలించింది. 'పిల్లలా.. పిడుగులా' అనే విధంగా ఎన్నో కొత్త కొత్త వస్తువులను కనిపెట్టిన 'పిల్ల శాస్త్రవేత్తల' గురించి తెలుసుకున్నాం. కొంగ జపం వెనక అసలు విషయమేమిటో 'ఎందుకు' చదివాకే తెలిసింది.

**- వై. రమ్యశ్రీ,** డోర్నకల్

# హోలీ.. నవ్వుల రంగేలీ...

'హోలీ' అంటే చిన్నాపెద్దా అందరికీ ఉత్సాహమే. మనుషుల మధ్య ఉండే తారతమ్యాలను మరిచి.. అందరూ కలిసిపోయి రంగులు పూసుకుంటూ.. పాటలు పాడుకుంటూ.. ఆనందాలను పంచుకునే వేడుక హోలీ. ఫాల్గుణ పౌర్ణమినాడు వచ్చే ఈ పండగకు 'కాముని పున్నమి', 'వసంతోత్సవం', 'రంగుల పంచమి', 'డోల్ పూర్ణిమ', 'బసంత్ ఉత్సవ్', 'దులంది ఉత్సవ్' అని రకరకాల పేర్లున్నాయి.

హోలీ పండుగ ముందు రోజు రాత్రి కామున్ని కాల్చుతారు. ఈ 'కామదహనం'తో చలికాలానికి వీడ్కోలు చెప్పి, వసంతోత్సవానికి స్వాగతం చెబుతారు. పొద్దుపొద్దున్నే అందరూ ఒకరికొకరు రంగులు పూసుకుంటూ సంతోషంగా వేడుకల్లో పాల్గొంటారు. నగరాల్లో మధ్యాహ్నంతో పండగ ముగిసినట్లనిపిస్తుంది కాని గ్రామాల్లో మాత్రం సాయంకాలమే రంగుల జోరు ఎక్కువగా కనిపిస్తుంది. రంగులు చల్లుకుంటూ ఊరంతా తిరుగుతూ పాటలు పాడుకుంటూ ఆనందంగా నృత్యాలు చేయడం కనిపిస్తుంది. చెడుపై మంచి సాధించిన విజయానికి గుర్తుగా జరుపుకునే ఈ సంబరాల గురించి ప్రతి ఒక్కరికీ తీపి జ్ఞాపకాలే ఉంటాయి.

**హోలీ కథ...**

హిరణ్యకశిపుడి చెల్లెలు హోళిక. అన్న ఆజ్ఞ మేరకు సొంత మేనల్లుడైన ప్రహ్లాదుడిని చంపడానికి వెళ్లి, మంటల్లో చిక్కుకుని చనిపోతుంది. ప్రహ్లాదుడు బతికాడనే సంతోషంతో ప్రజలు ఏటా ఆ రోజున హోలీ పండుగ జరుపుకుంటారనేది ఒక కథనం. హోలీ పుట్టుకకు సంబంధించిన మరో కథ ఏమిటంటే తన మనోనిగ్రహానికి భంగం కలిగించాడనే కోపంతో ఒకనాడు మన్మథుడిని శివుడు తన మూడో కంటితో భస్మం చేస్తాడు. తర్వాత రతీదేవి ప్రార్థించగా శరీరం లేకున్నా కూడా జీవించి ఉండేలా మన్మథుడికి వరం ఇస్తాడు. శివుడి చేతిలో కాముడు దహనం అయిన రోజు కాబట్టి దీన్ని 'కాముని పున్నమి', 'కామదహనం' అని కూడా పిలుస్తారు. అలాగే శ్రీకృష్ణుడిని ఉయ్యాలలో వేసిన రోజు కూడా హోలీనే. అందుకే ఈరోజున చిన్నపిల్లలను ఉయ్యాలలో వేస్తూ 'డోలికోత్సవం' చేస్తారు.

**అక్కడ ప్రత్యేకం..**

శ్రీకృష్ణుడి జన్మస్థలమైన మధురలో.. గోపాలుడు పెరిగిన బృందావనంలో... రాధ జన్మస్థలంగా చెప్పుకునే బర్సానా లో హోలీ ఉత్సవాలు 16 రోజుల పాటు జరుగుతాయి. ఇక్కడ హోలీ పండుగకు వేరే కథ ఉండడం విశేషం. పాలమీగడ కంటే తెల్లగా ఉండే రాధ ఒంటి రంగుతో నల్లని కిట్టయ్య తన ఒంటి రంగును పోల్చుకుని చిన్నబుచ్చుకుంటే.. యశోద రాధ మొహానికి ఇంత రంగు పూసిందని.. అప్పటి నుంచే హోలీ పండుగ జరుపుకోవడం మొదలైందని మధురవాసులు చెబుతారు. కృష్ణుడు బృందావనం నుంచి బర్సానాకు వెళ్లి రాధను, ఆమె చెలికత్తెలను ఆటపట్టిస్తుంటే... కొంటె కృష్ణుడి అల్లరిని భరించలేక రాధ, ఆమె చెలికత్తెలు కర్రలు పట్టుకుని ఆయనను వెంబడించేవారట. దీనికి ప్రతీకగానే అక్కడ హోలీ ఉత్సవం చిలిపి తగువులతో.. కొంటె కోలాటాలతో సరదాగా సాగుతుంది. మధుర, బృందావనం ప్రాంతాల్లో ఉండే యువకులు బర్సానాకు వచ్చి అక్కడి రాధారాణి ఆలయంలో ఒక జెండాను పాతి 'మాదే విజయం' అంటూ ఆ ప్రాంత అమ్మాయిలను ఆటపట్టిస్తారు. బర్సానా అమ్మాయిలు లావుపాటి కర్రలతో వారిని వెళ్లగొడతారు. కర్ర దెబ్బలు తగలకుండా అబ్బాయిలు డాలును అడ్డం పెట్టుకుంటారు. దీనిని 'లాఠ్‌మార్ హోలీ' అని పిలుస్తారు. ఈ ఉత్సవం చివరి రోజున అందరూ రంగులు జల్లుకుంటూ, పాటలు పాడుకుంటూ గడుపుతారు.

పశ్చిమ బెంగాల్‌లోని శాంతినికేతన్‌లో రంగోలీ ఉత్సవాలు రవీంద్రనాథ్ ఠాగూర్ ప్రారంభించారు. హోలీ రోజున విద్యార్థులంతా రంగురంగుల దుస్తుల్లో.. వివిధ వేషధారణలలో వచ్చి, అతిథుల కోసం ఆడిపాడతారు. ఈ ఉత్సవాలను చూసేందుకు విదేశాల నుంచి కూడా అనేక మంది విద్యార్థులు వస్తుంటారు. హర్యానాలో జరిగే హోలీ ఉత్సవాల్లో స్త్రీలదే ప్రధాన పాత్ర. ఆ రోజున తమను తిట్టి, కొట్టిన భర్తలను, మరుదులను, మరదళ్లను తిరిగి కొట్టి.. చిలిపి ప్రతీకారాలు తీర్చుకునే హక్కు స్త్రీలకు లభిస్తుంది. అక్కడి ప్రజలు దీన్ని 'దులంది హోలీ' అని పిలుస్తారు.

ఇటీవలి కాలంలో ఢిల్లీలో జరిగే హోలీ ఉత్సవాల్లో రెయిన్ డాన్సులు, హోరెత్తించే డిజె సంగీతం ప్రత్యేక ఆకర్షణగా ఉంటున్నాయి. పంజాబ్‌లోని ఆనందపూర్ సాహిబ్‌లో హోలా మొహల్లా పేరుతో సిక్కులు ఉత్సవాలు జరుపుకుంటారు. క్రీ.శ. 1701 నుంచి జరుగుతున్న ఈ ఉత్సవాల్లో యుద్ధకళలు, గుర్రపుస్వారీ, గుర్రాన్ని రెండు కాళ్ల మీద నించోబెట్టడం, పొడవైన తలపాగా కట్టుకోవడం వంటి వాటిల్లో పోటీలు జరుగుతాయి. ఆకాశంలోకి రంగులను వెదజల్లి సృష్టించే రకరకాల ఆకృతులు వీక్షకులను అబ్బురపరుస్తాయి. కర్ణాటకలోని హంపిలో ప్రజలు డప్పు వాయిద్యాలను వాయిస్తూ వీధుల్లోకి వచ్చి పాటలు పాడుకుంటూ, రంగులు జల్లుకుంటూ నృత్యాలు చేస్తారు. పేరుకు హిందువుల పండగే అయినా అన్ని మతాల వాళ్లు ఎంతో ఇష్టంగా హోలీని జరుపుకుంటారు. మన దేశంతో పాటు నేపాల్, పాకిస్థాన్, మయన్మార్, భూటాన్, శ్రీలంక, జపాన్, అమెరికా, ఆస్ట్రేలియా వంటి అనేక దేశాల్లో హోలీ పండుగను ప్రజలు సంబరంగా జరుపుకుంటారు.

**హ్యాపీ హోలీ..!**

# ట్రైలర్‌కి రికార్డు హిట్స్...

'మీరొక పెద్ద భవంతిలో ఒంటరిగా నివాసం ఉంటున్నారు. మీరు లోపల ఉన్నప్పుడు అనుకోకుండా డోర్ లాక్ పడిపోయి, చుట్టుపక్కల సాయం చేసేవాళ్లు ఎవరూ లేరు. అప్పుడు మీ పరిస్థితి ఏంటి? ఇంట్లో తినడానికి.. తాగడానికి ఏమీ లేక.. కరెంటు పోయి.. ఫోన్ కూడా పగిలిపోతే.. మీరు అక్కడి నుంచి ఎలా బయట




పడతారు?'... ఊహించడానికే భయమేసేలా ఉంది కదూ.. ఇదే కథతో వస్తోంది 'ట్రాప్డ్' మూవీ. 'ఉడాన్', లుటేరా వంటి వినూత్న చిత్రాల దర్శకుడు విక్రమాదిత్య మోత్వానీయే ఈ చిత్ర దర్శకుడు. ఫిబ్రవరి 22న విడుదలయిన 'ట్రాప్డ్' మూవీ ట్రైలర్ వారం రోజుల్లోనే 27 లక్షలకు పైగా వ్యూస్ సాధించి రికార్డు సృష్టించింది. 'షాహిద్' చిత్రంలో నటనకు జాతీయ ఉత్తమ నటుడిగా ఎంపికైన రాజ్‌కుమార్ రావ్ ఈ చిత్రంలో ప్రధాన పాత్ర పోషిస్తున్నాడు. ట్రైలర్ సూపర్ హిట్ కావడంతో మార్చి 17న విడుదలవుతున్న ఈ చిత్రంపై భారీ అంచనాలు ఏర్పడ్డాయి.

• హిట్స్ •




## ఒక వెరైటీ ప్రేమకథ...

ఒక అందమైన అమ్మాయికీ.. క్రూరమైన మృగానికీ మధ్య జరిగే ప్రేమకథ 'బ్యూటీ అండ్ ద బీస్ట్'. కార్టూన్, ఫ్యాంటసీ చిత్రాలను నిర్మించే వాల్ట్ డిస్నీ పిక్చర్స్ సంస్థ నుంచి వస్తోన్న ఈ చిత్ర ట్రైలర్ ఫిబ్రవరి 20న విడుదలైంది. వారం రోజుల్లోనే 39 లక్షలకు పైగా వ్యూస్ సాధించి టాప్‌లో నిలిచింది. 17వ శతాబ్దంలో ఫ్రెంచ్‌లో వచ్చిన నవల 'బ్యూటీ అండ్ ది బీస్ట్'. ఈ కథ ఆధారంగా అదే పేరుతో 1991లో ఒక యానిమేషన్ కార్టూన్ చిత్రంగా వచ్చింది. దాన్నే ఇన్నేళ్ల తర్వాత 3డి ఫార్మాట్‌లో విజువల్ వండర్‌గా రూపొందించారు. ఎమ్మా వాట్సన్, డాన్ స్టీవెన్స్ ప్రధాన పాత్రల్లో నటించిన ఈ చిత్రానికి బిల్ కండోన్ దర్శకుడు. ఒక అడవిలో పువ్వును కోసినందుకు ఎమ్మా వాట్సన్ తండ్రిని ఎత్తుకెళ్లి ఒక పెద్ద కోటలో బంధిస్తాడు మృగంలా ఉండే ఒక మనిషి. తండ్రిని వెతుక్కుంటూ వెళ్లి ఎమ్మా ఆ కోటలో ఎలాంటి పరిస్థితులు ఎదుర్కొందీ, తర్వాత మృగం లాంటి మనిషితో ఆమె ఎలా ప్రేమలో పడింది అనేదే సినిమా కథ. పిల్లల కోసం ప్రత్యేకంగా రూపొందించిన ఈ సినిమా మార్చి 17న విడుదలవుతోంది.




## 'ఇంతలో... ఎన్నెన్ని వింతలో!'

'గతం మనకు ఎన్నో జ్ఞాపకాలను మిగులుస్తుంది... ఏం జరుగుతుందో తెలియని భవిష్యత్తు ఒక సర్‌ప్రైజ్‌లా ఉంటుంది. వాటి కంటే ప్రస్తుతం మనం ఎలా ఉన్నాం అన్నదే ముఖ్యం'. ఈ థీమ్‌తో వచ్చిన తెలుగు లఘుచిత్రం 'ఇంతలో ఎన్నెన్ని వింతలో..' ఫిబ్రవరి 14న వాలెంటైన్స్ రోజున విడుదలయిన ఈ షార్ట్ ఫిల్మ్ 10 రోజుల్లోనే 6 లక్షలకుపైగా వ్యూస్ సాధించి దూసుకుపోతోంది. శ్రీకాంత్ శ్రీ దర్శకత్వం వహించిన ఈ షార్ట్‌ఫిల్మ్‌కు వ్యాస్ ఆకొండి నిర్మాత. "ఫేస్‌బుక్ నేమ్స్‌నే రియల్ నేమ్స్ అనుకుంటున్నారు, ఫేస్‌బుక్ లైక్స్ బట్టే ఫేస్ వాల్యూ డిసైడ్ చేసేస్తున్నారు...", "ఫ్యాక్ట్ అనిపిస్తే ఫేస్‌బుక్‌లో పెట్టు, వెయిటుంది అనిపిస్తే వాట్సాప్‌లో పెట్టు, తేడాగా అనిపిస్తే ట్విట్టర్‌లో పెట్టు.. మామూలుగా అనిపిస్తే మైండ్‌లో పెట్టుకో.." లాంటి డైలాగులు బాగున్నాయి. సుమన్ వంకర మ్యూజిక్ అందించిన ఈ లఘుచిత్రంలో ఒక పాట కూడా ఉంది.






# ఎత్తు ఒక సమస్యా ..?

**మా అమ్మాయి వయసు పదమూడేళ్లు. క్లాసు పిల్లలందరిలో తనే పొట్టిగా ఉన్నానని బాధ పడుతుంది. పొడవు పెరగాలని రాడ్ పట్టుకుని వేలాడుతుంది. చదువు మీద కూడా శ్రద్ధ తగ్గింది. ఏం చేయమంటారు?**

● **జి. జ్యోతి,** గుడివాడ, కృష్ణాజిల్లా

పొడుగ్గా ఉండాలి, అందంగా ఉండాలి అనే ఆలోచనలు ఈ మధ్య టీనేజ్ పిల్లల్లో ఎక్కువవుతున్నాయి. కొన్ని ప్రకటనలు ఈ ధోరణిని ప్రతిబింబించడంతో వాళ్లలో ఆ భావన బాగా వేళ్లూనుకుంటోంది. పొట్టి పిల్లలకు కొందరు 'నువ్వు రాడ్ పట్టుకుని వేలాడు... బాస్కెట్ బాల్ ఆడు' అని ఏవేవో సలహాలు ఇస్తుంటారు. దాంతో వాళ్ల దృష్టి మొత్తం వ్యాయామం, ఆటల వైపు డైవర్ట్ అయిపోతుంది.

'పొట్టిగా ఉన్నాను' అనే బాధ ఆత్మన్యూనతగా మారితే కష్టం. వాళ్ల లేత మనసుల్లో ఆ భావన ముద్రించుకోకముందే జాగ్రత్తపడాలి. ముందు మీ అమ్మాయికి వాస్తవాలను వివరించి చెప్పండి. 'జన్యు పరంగా తల్లిదండ్రుల సగటు ఎత్తే అటుఇటుగా పిల్లల ఎత్తు అవుతుంది' అనే విషయాన్ని ఆమెకు అర్థమయ్యేలా చెప్పాలి. వ్యాయామాలు, ఆటలతో ఇబ్బంది లేదు కాని వాటి వల్ల పొడవు పెరుగుతారనే భ్రమను మాత్రం తొలగించండి. ఆటల వల్ల ఇతర ఉపయోగాలేమిటో తెలియజేసి వాటికి కొద్ది సమయాన్ని కేటాయించవచ్చని... వాటిని అమ్మాయి టైమ్‌టేబుల్‌లో చేర్చండి. మొదట మీ మాటలు విని అమ్మాయి చిన్నబుచ్చుకోవచ్చు. దాన్నుంచి బయట పడేసి ఆమెలో తిరిగి ఉత్సాహం నింపడానికి పొట్టి వారు సాధించిన విజయాల గురించి చెప్పాలి. ఉదాహరణకు... 'నీకు క్రికెటర్ సచిన్ హైట్ ఎంతో తెలుసా?' అని అడిగి, అతడు పొట్టి వాడైనా గొప్ప క్రికెటర్ ఎలా అయ్యాడో చెప్పొచ్చు. 'అతడిలాగే చాలామంది పొట్టివాళ్లు గొప్ప విజయాలు సాధించారు. పొట్టి, పొడవు అనేది సమస్య కాదు. నీ అసలు టాలెంటు అది గ్రహించి సంతోషంగా ఉండటం ముఖ్యం' అని చెప్పండి. మీ మాటల ద్వారా ఆమెను ఆలోచించేలా చేయండి. ఇంతకీ మీ అమ్మాయి వయసు పదమూడేళ్లే అంటున్నారు కదా... అమ్మాయిలు పద్దెనిమిదేళ్ల వరకూ పెరుగుతారు. పెరిగినా పెరగకపోయినా మీ అమ్మాయి వాస్తవికంగా ఆలోచించి అర్థం చేసుకునేలా చేయాల్సింది మీరే!

**మా అబ్బాయికి బాడీ బిల్డింగ్ అంటే బాగా ఇష్టం. ఎక్కువగా జిమ్ చేస్తుంటాడు. చదువు దగ్గరకు వచ్చేసరికి అంత ఆసక్తి ఉండదు. వాడి భవిష్యత్తు ఏమౌతుందో అర్థం కావట్లేదు.**

● **ఎ. రాధ,** సత్తుపల్లి, ఖమ్మం జిల్లా

కొంతమందిలో కొన్ని బలమైన ఆసక్తులుంటాయి. వాటిని సరైన మార్గంలోకి మళ్లిస్తే మంచి భవిష్యత్తును నిర్మించుకోవచ్చు. మీకో చిన్న ఉదాహరణ చెపుతా. మీ అబ్బాయిలాగే బాడీ బిల్డింగ్ అంటే ఆసక్తి ఉన్న ఒక అబ్బాయి ఆ మధ్య నా దగ్గరికి వచ్చాడు. వాళ్లింట్లో అందరూ బాగా చదువుకున్న వాళ్లు. అతడికి మాత్రం చదువుపై అంత ఆసక్తి లేదు. బాడీ బిల్డింగ్‌లో బోల్డన్ని సర్టిఫికెట్ కోర్సులు చేశాడు. వాటన్నిటినీ నా ఎదుట పెట్టాడు. శారీరక దారుఢ్యంపై అతడికి విపరీతమైన ప్రేముందని అర్థమైంది. 'నేను నాకున్న ఆసక్తితో పైకి ఎదగలేనా?' అని అడిగాడు. 'దానిపై నీకంత ఆసక్తి ఉంటే నువ్వు ఫిజియో థెరపీ కోర్సు ఎందుకు చదవకూడదు?' అని అడిగాను. 'కోర్సు కష్టంగానే ఉంటుంది కానీ నువ్వు జీవితంలో ఎదగడానికి నీకది ఉపయోగపడుతుంది' అని వివరించాను. చదువంటే గిట్టదన్నవాడు ఆ తర్వాత క్రమం తప్పకుండా కాలేజీకి వెళ్లి కోర్సు పూర్తి చేశాడు. మరోసారి నన్ను కలిసినప్పుడు 'న్యూట్రిషన్ కోర్సు కూడా చేస్తే నీకు మరింత ఉపయోగపడుతుంది' అని చెప్పాను. వెంటనే అదీ చేశాడు.

ప్రస్తుతం అతడు అయిదు వ్యాయామశాలలను నిర్వహిస్తూ వాళ్ల ఇంట్లో వాళ్లు ఊహించినదాని కన్నా గొప్ప స్థాయికి చేరుకున్నాడు. అతడి విజయంలో 'నేను ఏదో ఒకటి సాధించాలి' అనే తపన ఒక కారణమైతే, తన అభిరుచికి అనుగుణమైన రెండు కోర్సులను చేయడం కూడా కారణం. అతడికి ఆసక్తి ఉన్న రంగంతో పాటు దానికి సంబంధమున్న మరో రంగంలోనూ క్వాలిఫికేషన్ సాధించడంతో అతడి విజయావకాశాల పరిధి పెరిగింది. అలానే మీ అబ్బాయికి ఆసక్తి ఉన్న రంగమేదో తెలుసుకుని ఆ దిశగా ప్రయత్నం చేయమనండి. దానికి మీ పూర్తి మద్దతు అందించండి. అప్పుడు అతడు కూడా విజయం సాధించగలడు.



**సుజాతా రాజమణి**
కన్సల్టెంట్ సైకోథెరపిస్ట్, కిమ్స్ హాస్పిటల్

మీ పిల్లల ప్రవర్తనకు సంబంధించి ఏమైనా ప్రశ్నలుంటే మాకు పోస్ట్‌లో గానీ, మెయిల్‌లో గాని పంపవచ్చు.
**అడ్రస్ :** ఆదివారం ఆంధ్రజ్యోతి, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33, **మెయిల్ ఐడి :** sunday.aj@gmail.com








పామిడి

# అక్కడందరూ నైట్‌డ్రెస్‌లే కుడతారు

**ఆ గ్రామంలోకి అడుగుపెట్టగానే కుట్టుమిషన్ల చప్పుడు లయబద్ధంగా వినిపిస్తుంది. ఏ ఇంట్లోకెళ్లినా కుప్పలు కుప్పలుగా కట్‌చేసి ఉన్న వస్త్రాలు ఒకవైపు, వాటితో కుట్టిన నైటీలు, నైట్ ప్యాంట్లు మరోవైపు కనిపిస్తాయి. ప్రతీరోజూ ఆ గ్రామంలో సుమారు 6 లక్షల నైటీలు, నైట్ ప్యాంట్లు, లంగాలు కుడతారంటే ఆశ్చర్యపోక తప్పదు. నైటీలు, నైట్‌ప్యాంట్ల తయారీని కుటీర పరిశ్రమలా మార్చుకున్న ఆ గ్రామం పేరు పామిడి.**

అనంతపురం జిల్లాలోని ఒక చిన్న గ్రామం పామిడి. ఈ గ్రామం బట్టల వ్యాపారానికి ప్రసిద్ధి చెందింది. గ్రామంలోని 8 వేల కుటుంబాల్లో 4వేల కుటుంబాలు భావసార క్షత్రియులు. భావసార క్షత్రియులంటే వలస రాజులని అర్థం. వీరు బహమనీ సుల్తానుల దాడులకు భయపడి మహారాష్ట్ర నుంచి వలస వచ్చి పామిడిలో స్థిరపడ్డారని చెపుతారు. వీరికి దర్జీపనిలో నైపుణ్యం ఉంది. అప్పట్లో రాజులకు రకరకాల డిజైన్లతో దుస్తులు తయారు చేసి వారి మెప్పు పొందేవారట. వలస ప్రాంతాల్లో కూడా వారు దర్జీపనినే వృత్తిగా ఎంచుకున్నారు. క్రమక్రమంగా వారి వృత్తి ఇతర సామాజిక వర్గాలకు చెందిన స్థానికులకు కూడా అబ్బింది. అదే ఇప్పుడు కొన్ని వేల కుటుంబాలకు జీవనాధారమైంది.

### వెరైటీ నైటీలు, నైట్‌ప్యాంట్లు...

భావసార క్షత్రియులు మొదట్లో సైను బనియన్లు, లంగాల వంటివి కుట్టేవారు. ఆ తర్వాత ఫ్యాన్సీ డ్రస్సులు, బ్రాసరీలు, స్కూల్ బ్యాగులు, ఖాకీ చెడ్డీలు, నైట్ ప్యాంట్లు, లంగాలు, నైటీలు.. ఇలా కాలానికి అనుగుణంగా వారు తమ దర్జీపనిని కూడా మార్చుకున్నారు. ప్రస్తుతం పామిడిలో తయారయ్యే 100 పీసుల్లో 50 శాతం నైటీలు, 35 శాతం నైట్ ప్యాంట్లు, 15 శాతం లంగాలు ఉంటున్నాయి. నైటీల్లో 10 రకాలు కుడతారు. వాటిలో కాలర్, ఫ్యాన్సీ, కళ్యాణి, మదర్ కళ్యాణి, గజినీ నైట్‌సూట్, గౌన్లు, శరీనా వంటివి ప్రధానమైనవి. నైటీల్లో మీడియం, డబుల్ ఎక్సెల్, జీరో సైజులు తయారవుతున్నాయి. నైట్ ప్యాంట్లను 1, 2, 3, 4 నెంబర్ల సైజులుగా విభజించి కుడతారు.

జైపూర్, కోల్‌కతా, ముంబయ్, తమిళనాడు, అహ్మదాబాద్‌ల నుంచి బట్టల బేళ్లను దిగుమతి చేసుకుంటారు. కటింగ్ మాస్టర్లు కటింగ్ మిషన్ల ద్వారా వివిధ సైజుల్లో కత్తిరిస్తారు. ఒక్కో పీస్ విడిగా కాకుండా మిషన్ ద్వారా ఒకేసారి 200 పీసులను కట్ చేస్తారు. పామిడిలో ఆ విధంగా రోజుకు 8 లక్షల పీసులు కట్ చేస్తారు. పట్టణంలో సుమారు రెండువేల దుకాణాలున్నాయి. ఒక్కో షాపులో ఇద్దరు కటింగ్ మాస్టర్లున్నారు. అంటే నాలుగువేల మంది కటింగ్ మాస్టర్లు కలిసి రోజుకు 8 లక్షల పీసులు కటింగ్ చేస్తారన్నమాట. కటింగ్ అయిన తర్వాత వాటిని అనంతపురం జిల్లాలోని గుత్తి, గుంతకల్లు, అనంతపురం, బుక్కరాయసముద్రం, పామిడి, సింగనమల, గార్లదిన్నె, పెద్దవడుగూరు, తాడిపత్రి, యాడికి, కర్నూలు జిల్లాలోని ప్యాపిలి, డోన్, జొన్నగిరి, మద్దికెర, ఆదోని వరకూ కూడా టైలర్లు వాటిని తీసుకెళ్లి ఇళ్లలో కుడతారు. ఒక్కో నైటీకి రకాలను బట్టి 3 నుంచి 12 రూపాయల దాకా కుట్టుకూలీ ఇస్తారు. వారివారి సామర్థ్యాన్ని బట్టి రోజుకు ఒక్కొక్కరు 30 నుంచి 45 దాకా కుడతారు.

### ఐదు రాష్ట్రాలకు ఎగుమతి

ఈ విధంగా తయారైన దుస్తులను ఎప్పటికప్పుడు ఏపీతో పాటు తెలంగాణ, కర్నాటక, మహారాష్ట్ర, తమిళనాడు రాష్ట్రాలకు ఎగుమతి చేస్తారు. ఇందుకోసం పామిడిలో ట్రాన్స్‌పోర్ట్ కంపెనీలన్నీ బ్రాంచీలను ఏర్పాటు చేసుకున్నాయి. వీటిద్వారా ప్రతిరోజూ రెడీమేడ్ దుస్తులు పలు ప్రాంతాలకు ఎగుమతి అవుతుంటాయి. కడప, కర్నూలు, అనంతపురం, మహబూబ్‌నగర్, చిత్తూరు వంటి జిల్లాలనుంచి వచ్చే వ్యాపారులు ప్రతిరోజూ సుమారు రెండులక్షల దాకా తీసుకెళుతుంటారు. గ్రామాల్లో తిరిగి అమ్ముకునేవారు కూడా పామిడికి వచ్చి సరుకు తీసుకెళుతుంటారు. ఇక్కడ తరతరాలుగా రెడీమేడ్ వస్త్ర వ్యాపారం సాగుతుండడంతో పామిడిని 'సెకండ్ బాంబే'గా పిలుస్తారు.

**- పిడుగు సుబ్బారాయుడు** , ఫోటోలు: శ్రీకృష్ణ, అనంతపురం

కవర్ స్టోరీ

# 7 గ్రహాలు

**అందమైన వేసవి రాత్రి... నీలాకాశంలో మినుక్కు మినుక్కుమంటూ కొన్ని కోట్ల నక్షత్రాలు... రకరకాల ఆకారాలను తలపించే విశ్వ సందర్శనం... హఠాత్తుగా ఆ నక్షత్రాల మధ్య ఒక కదలిక. ఏమిటా కదలిక? మనలాంటి భూమే అక్కడ ఒకటుంటే... దానిలో జీవముంటే... వారు కూడా మనలాగే విశాల విశ్వంలో జీవరాశుల కోసం అన్వేషిస్తూ ఉంటే... ఇలాంటి ఊహలు, ఆలోచనలు మనలో అనేక మందికి వచ్చే ఉంటాయి. ఇప్పుడా ఊహలు వాస్తవానికి కాస్త దగ్గరికి వస్తున్నట్టున్నాయి. గత నెల కనుగొన్న 'ట్రాపిస్ట్-1' నక్షత్రం చుట్టూ తిరుగుతున్న సప్త పృథ్వీ మండలంలో జీవం ఉండటానికి అన్ని రకాల అవకాశాలు ఉన్నాయంటున్నారు ఖగోళ శాస్త్రవేత్తలు. అంతరిక్షంలో జీవాన్వేషణను కొత్త మలుపు తిప్పి, ఎన్నో ఆశలను మోసుకొచ్చిన 'ట్రాపిస్ట్ 1' సౌర కుటుంబ విశేషాలే ఈ వారం కవర్‌స్టోరీ.**

# ఎన్నెన్నో ఆశలు...

భూమి మీద 750 కోట్ల మంది మనుషులు నివసిస్తున్నప్పటికీ విశాల విశ్వంలో మాత్రం మనిషి ఒంటరే. ఈ ఒంటరి భావన కొన్ని లక్షల ఏళ్ల నుంచి మనిషిని వేధిస్తూనే ఉంది. తన లాంటి జీవమే మన సౌర వ్యవస్థలోగానీ... ఈ వ్యవస్థ అవతలగానీ ఉంటే, వారితో మనం సంబంధాలు ఏర్పాటు చేసుకోగలిగితే ఎలా ఉంటుందనే ఆలోచన... దాని నుంచి పుట్టిన అన్వేషణ కొనసాగుతూనే ఉంది.

సూర్యుడిలాంటి ఒక నక్షత్రం చుట్టూ ఒక గ్రహ వ్యవస్థ ఉంటే.. ఆ వ్యవస్థలో ఎక్కడో చోట మనలాంటి జీవం ఉండే అవకాశం ఉంటుందనేది ఖగోళ శాస్త్రవేత్తల ప్రతిపాదన. దీనికి కూడా ఒక కారణముంది. గత శతాబ్ద కాలంగా జరిగిన పరిశోధనల్లో అతి శీతల ఉష్ణోగ్రతలలోనూ, అత్యంత వేడిమిలోనూ జీవించగలిగిన సూక్ష్మజీవులను శాస్త్రవేత్తలు గుర్తించగలిగారు. ఇలాంటి జీవులు ఇతర గ్రహాలపై కూడా ఉంటే అవి కూడా వివిధ పరిణామ దశలను దాటి ఏదో ఒక రూపాన్ని పొంది ఉంటాయనే భావనలు కొత్త కొత్త ఆలోచనలకు బీజం వేస్తున్నాయి. ఈ ఆలోచనల నేపథ్యంలో ఇప్పటికే అనేక నవలలు, హాలీవుడ్ సినిమాలు కూడా వచ్చాయి. అయితే వీటన్నింటికీ మొదటి అడుగు భూమిలాంటి గ్రహాలు ఈ సువిశాల విశ్వంలో ఎక్కడ ఉన్నాయనే విషయాన్ని కనిపెట్టడం. దీని కోసం అమెరికా అంతరిక్ష సంస్థ నాసా సుమారు ఆరు దశాబ్దాల నుంచి ప్రయత్నాలు చేస్తూ వస్తోంది. 1977లో నాసా ప్రయోగించిన వాయేజర్ అంతరిక్ష నౌక మన సౌర వ్యవస్థలోని శని, యురేనస్, నెప్ట్యూన్, జూపిటర్ వంటి గ్రహాలకు సంబంధించిన సమాచారాన్ని ఇప్పటికీ అందిస్తోంది.


నాసా కేంద్ర కార్యాలయంలో ట్రాపిస్ట్-1 ప్రకటన చేస్తున్న ఖగోళ శాస్త్రవేత్తలు

వాయేజర్ మాత్రమే కాకుండా...
లివర్‌పూల్‌లోని జాన్ మోర్స్ విశ్వవిద్యాలయంలోని రోబోటిక్ టెలిస్కోప్, అంతరిక్షంలోని స్పిట్జర్ టెలిస్కోప్ వంటి అత్యాధునిక పరికరాలు కూడా బుధుడు, గురుడు, అంగారకుడు, కుజుడు వంటి గ్రహాలకు సంబంధించిన సమాచారాన్ని అనునిత్యం అందిస్తున్నాయి. ఈ సమాచారశక్తి చూకూరాక ఎక్సోప్లానెట్స్ (మన సౌరవ్యవస్థకు దూరంగా ఉండే గ్రహాలు)పై పరిశోధనలు చేయటానికి శాస్త్రవేత్తలు పూనుకున్నారు. ఇలా గత 25 ఏళ్లుగా సాగుతున్న గ్రహాన్వేషణలో ఇప్పటి దాకా 3,577 గ్రహాలను కనుగొనగలిగారు. అయితే వీటిలో మన భూమిని పోలిన గ్రహాలు తక్కువే. ఈ నేపథ్యంలో బెల్జియంలోని లీజ్ విశ్వవిద్యాలయానికి చెందిన మైఖేల్ గిల్లన్ అనే ఖగోళ శాస్త్రవేత్త నేతృత్వంలోని బృందం 'ట్రాపిస్ట్-1' అనే నక్షత్రాన్ని, దాని చుట్టూ తిరుగుతున్న ఏడు గ్రహాలను కనుగొన్నది.

### ఎందుకంత ఆసక్తి?

ప్రతి ఏడాది ఖగోళ శాస్త్రవేత్తలు వందల

సంఖ్యలో కాకపోయినా పదుల సంఖ్యలో కొత్త గ్రహాలను కనుగొంటూనే ఉంటారు. వీటికి పెద్ద ప్రచారం కూడా రాదు. అలాంటి పరిస్థితుల్లో ట్రాపిస్ట్-1పై ఖగోళ శాస్త్రవేత్తలు తమ దృష్టిని కేంద్రీకరించటానికి కొన్ని కారణాలున్నాయి. వీటిలో మొదటిది ట్రాపిస్ట్-1 చుట్టూ తిరుగుతున్న గ్రహవ్యవస్థ మన సౌర వ్యవస్థను పోలి ఉంది. రెండో కారణం- ఈ గ్రహాలన్నీ దాదాపు భూమి పరిమాణంలోనే ఉన్నాయి. ఇక మూడో కారణం- సూర్యుడితో పోల్చుకుంటే ట్రాపిస్ట్-1లో వేడిమి సగం మాత్రమే ఉంది. నాలుగో కారణం- ఇది మనకు 'కేవలం' 39 కాంతి సంవత్సరాల దూరంలో ఉండటం. ఈ నాలుగు కారణాల వల్ల ఈ కొత్త గ్రహ వ్యవస్థలో ఎక్కడైనా ఒక చోట జీవం ఉండే అవకాశముందని శాస్త్రవేత్తలు భావిస్తున్నారు.

"మాకు ఈ గ్రహాలు ఎలా ఉంటాయనే విషయం ఇంకా పూర్తిగా తెలియదు. అవి మంచుఖండాలతో నిండి ఉండొచ్చు లేదా ఎడారి వాతావరణంలో కూడా ఉండొచ్చు. అయితే ప్రస్తుతం మన దగ్గర ఉన్న ప్రస్తుత సమాచారం ఆధారంగా చూస్తే కొన్ని గ్రహాలపై వాతావరణం భూమిని సరిపోలేలా ఉంది. అంటే అక్కడ జీవం ఉండే అవకాశముంది. అలాంటి ఒక గ్రహాన్ని కనుగొనగలగటం... దానిపై పరిశోధనలు చేసే అవకాశం రావటం శాస్త్రవేత్తల్లో కొత్త ఉత్సాహాన్ని రేకెత్తిస్తోంది" అంటున్నారు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయానికి చెందిన ఖగోళ శాస్త్రవేత్త డైడీర్ క్యూలోజ్. హబుల్ స్పేస్ టెలిస్కోప్ ద్వారా ట్రాపిస్ట్-1పై ఉన్న వాతావరణాన్ని విశ్లేషించటానికి శాస్త్రవేత్తలు ఇప్పటికే ప్రయత్నాలు మొదలు పెట్టారు.



నాసా విడుదల చేసిన స్పేస్ టూరిస్ట్ ఊహా చిత్రం

### అక్కడ పరిస్థితులేమిటి..?

ఇప్పటి దాకా మన శాస్త్రవేత్తల దగ్గర ఉన్న సమాచారం ఆధారంగా చూస్తే ట్రాపిస్ట్-1 చుట్టూ ఏడు గ్రహాలు మన సౌర వ్యవస్థలోలాగే తమవైన ప్రత్యేక కక్ష్యలలో తిరుగుతున్నాయి. వీటిలో మొదటి గ్రహం (బి) ట్రాపిస్ట్-1 చుట్టూ తిరగటానికి 36 గంటలు పడితే... చివరి గ్రహానికి(హెచ్) 20 రోజులు పడుతోంది. అంటే సూర్యుడి చుట్టూ భూమి ఎంత వేగంతో తిరుగుతోందో (24 గంటలు) 'బి' గ్రహం అంత కన్నా కొద్దిగా నెమ్మదిగా తిరుగుతోంది. అయితే ఈ గ్రహాలు ఏవీ కూడా మన భూమిలాగా తమ చుట్టూ తాము తిరుగుతూ ట్రాపిస్ట్-1 చుట్టూ తిరగటం లేదు. కేవలం ట్రాపిస్ట్-1 చుట్టూ మాత్రమే తిరుగుతున్నాయి. అందువల్ల ప్రతి గ్రహంలోనూ ఒక వైపు చీకటి, మరో వైపు వెలుతురు శాశ్వతంగా ఉంటాయి. అంటే మనలాగా అక్కడ రాత్రి, పగలు ఉండవు. ఈ చీకటి వెలుగులు గ్రహ ఉష్ణోగ్రతపై ఎలాంటి ప్రభావం చూపిస్తాయనే విషయం ఇంకా తెలియదు. అయితే ట్రాపిస్ట్-1లో ఉష్ణోగ్రతలు మన సూర్యుడిలో కన్నా తక్కువ ఉన్నాయి కాబట్టి ఆ గ్రహాలలో జీవం ఉండే అవకాశాలు మెండుగా ఉన్నాయనేది శాస్త్రవేత్తల భావన.

సాధారణంగా ఎక్కడైనా జీవం ఉండటానికి అనువైన పరిస్థితులు ఉన్నాయా? లేదా అనే విషయాన్ని కనుగొనటానికి శాస్త్రవేత్తలు గాలిలో తేమ, ఆక్సిజన్, ఓజోన్, మిథేన్, కార్బన్‌డయాక్సైడ్ వంటి వాటిని అంచనా వేస్తారు. వాటి ఆధారంగా జీవం ఉండటానికి అనువైన పరిస్థితులున్నాయా? లేదా? అనే విషయాన్ని తేలుస్తారు. హబుల్ టెలిస్కోప్, చిలీలోని ట్రాపిస్ట్ టెలిస్కోప్‌ల ద్వారా సేకరించిన సమాచారం ప్రకారం చూస్తే కొత్త గ్రహ వ్యవస్థలో జీవం ఉండటానికి అవసరమైన పరిస్థితులన్నీ ఉన్నాయి. అందుకే నాసా సైన్స్ డైరెక్టరేట్‌లోని అసిస్టెంట్ అడ్మినిస్ట్రేటర్ జ్యూర్ బుచన్ "భూమిలాంటి మరో గ్రహం ఉందా? లేదా? అనేది ఇప్పుడు ప్రశ్నే కాదు. అక్కడ జీవం ఉందా? ఉంటే దానిని ఎప్పుడు కనుగొంటామనేదే ప్రధానమైన ప్రశ్న" అని ధీమాగా ప్రకటించగలిగారు.

### సవాళ్లు అనేకం..

మన సౌర కుటుంబంలో ప్రతి గ్రహం చుట్టూ ఒక వాతావరణం ఉంటుంది. ఈ వాతావరణం అంతరిక్షం నుంచి దూసుకువచ్చే ప్రమాదకరమైన వాయువులను జల్లెడ పడుతూ ఉంటుంది. ఆ ప్రమాదకరమైన



# గ్రహమంటే ఏమిటి?

ప్లానెట్ (గ్రహం) అనే మాటను తొలిసారి వాడింది గ్రీకులు. గ్రీకు భాషలో ప్లానెట్ అంటే తిరిగే నక్షత్రం అని అర్థం. నిజానికి మన సౌర వ్యవస్థలో ఎన్ని గ్రహాలు ఉన్నాయనే విషయంపై గత కొన్ని వేల ఏళ్లగా ఏకాభిప్రాయం లేదు. దాదాపు రెండు వేల ఏళ్ల క్రితం గ్రీకు తత్వవేత్త అరిస్టాటిల్ మనకు ఏడు గ్రహాలు (సూర్యుడు, చంద్రుడు, భూమి, శుక్రుడు, అంగారకుడు, బుధుడు, కుజుడు, శని) ఉన్నాయని ప్రతిపాదించాడు. 15వ శతాబ్దం దాకా అందరూ ఈ ప్రతిపాదననే అంగీకరించారు. అయితే భూమే ఈ సౌరవ్యవస్థకు కేంద్ర బిందువుగా భావించేవారు. భారతీయ సంప్రదాయంలో 7 గ్రహాలతో పాటుగా రాహువు, కేతువులను కూడా గ్రహాలుగానే భావించేవారు. భారతీయ జ్యోతిష్యంలో ఇప్పటికీ ఈ పద్ధతినే అనుసరిస్తున్నారు.

15వ శతాబ్దం మొదట్లో కొపర్నికస్ మన సౌర వ్యవస్థకు కేంద్ర బిందువు సూర్యుడని ప్రతిపాదించాడు. సూర్యుడు గ్రహం కాదని, నక్షత్రమని పేర్కొన్నాడు. దీనితో గ్రహాల సంఖ్య ఆరుకు పడిపోయింది. 1610లో గెలీలియో తాను రూపొందించిన టెలిస్కోప్ ద్వారా జూపిటర్ సమీపంలో ఉన్న నాలుగు ఉపగ్రహాలను గుర్తించాడు. ఈ శతాబ్దం చివరి నాటికి క్రిస్టియాన్ హ్యూజిన్స్, జీన్ డామినిక్యూ కాసినీ శనిగ్రహం చుట్టూ తిరుగుతున్న మరో ఐదు ఉపగ్రహాలను గుర్తించారు. ఆ సమయంలో ఉపగ్రహాలను కూడా గ్రహాలుగానే భావించేవారు. దీనితో 16వ శతాబ్దం చివరినాటికి గ్రహాల సంఖ్య 15కి చేరుకుంది. ఆ తర్వాత శాస్త్ర ప్రపంచంలో ఏది గ్రహం, ఏది ఉపగ్రహం అనే విషయంపై తీవ్రమైన చర్చ జరిగింది. జూపిటర్, శని గ్రహాల దగ్గర ఉన్నవి కేవలం ఉపగ్రహాలని నిర్ధారించటంతో గ్రహాల సంఖ్య మళ్లీ ఆరుకి పడిపోయింది. ఆ తర్వాత యురేనియస్‌ను కనుగొనటంతో గ్రహాల సంఖ్య ఏడుకు చేరుకుంది. ఆ తర్వాత ప్లూటో, నెప్ట్యూన్‌లను కూడా గ్రహాలుగా గుర్తించటం మొదలుపెట్టారు. దీనితో సౌర వ్యవస్థలో గ్రహాల సంఖ్య తొమ్మిదికి చేరింది. ఆ మధ్యలో ఒక దశలో మార్స్, జూపిటర్‌ల మధ్యనున్న గ్రహశకలాలను కూడా గ్రహాలుగా లెక్కపెట్టేవారు.

దీనితో ఒక దశలో గ్రహాల సంఖ్య 13కి చేరుకుంది. ఇన్ని మార్పులు చేర్పులు తర్వాత- 2006లో ఇంటర్నేషనల్ అస్ట్రానామికల్ యూనియన్ గ్రహం అంటే ఏమిటనే విషయాన్ని స్పష్టంగా పేర్కొంది. గురుత్వాకర్షణ శక్తి వల్ల గుండ్రటి ఆకారంలో ఉండి ఒక నక్షత్రం చుట్టూ తిరిగే అంతరిక్ష పదార్థాన్ని గ్రహంగా ఇంటర్నేషనల్ అస్ట్రానామికల్ యూనియన్ (ఐఏయూ) నిర్వచించింది. దీని ప్రకారం ప్లూటోను గ్రహాల జాబితా నుంచి తొలగించారు. అయితే ఈ మధ్య మళ్లీ దాన్ని గ్రహంగా గుర్తించాలనే అభిప్రాయం వచ్చింది. ఒక గ్రహం పరిమాణాన్ని ఎలా కొలుస్తారంటే... ఒక నక్షత్రం ముందు నుంచి గ్రహం ప్రయాణించినపుడు ఆ నక్షత్రం కొద్దిగా మసకబారుతుంది. ఇది ఎంత మసకబారింది అనే విషయం ఆధారంగా గ్రహానికి, నక్షత్రానికి మధ్య ఉన్న దూరాన్ని కొలిచి వాటి పరిమాణాన్ని కనుగొంటారు. నక్షత్రాలు పెద్దవయ్యే కొద్దీ వాటిని కనిపెట్టడం సులువవుతుంది.




వాయువులను అడ్డుకొనే సామర్థ్యం ఉంటే జీవం మనుగడకు ఎటువంటి ప్రమాదం ఉండదు. లేకపోతే జీవం మనుగడ సాగించలేదు. ఉదాహరణకు భూమిపై 390 కోట్ల ఏళ్ల క్రితం విపరీతమైన వేడి ఉండేది. దీని వల్ల భూమిపైన ఉండే వాతావరణం పలచగా ఉండేది. దీనితో అతి నీల లోహిత కిరణాలు, ఓజోన్ వంటివి నేరుగా భూమిపై పడేవి. వీటి వల్ల కలిగే దుష్పరిమాణాలను తప్పించుకోవటానికి జీవరాశులు సముద్రాలలో మాత్రమే మనగలిగేవి. ఆ తర్వాత భూమిపై వేడి తగ్గుతూ వచ్చింది. దాదాపు 200 కోట్ల ఏళ్ల క్రితం భూమిపై వాతావరణం ఎలా ఉందో ప్రస్తుతం ట్రాపిస్ట్-1పై అలాంటి వాతావరణం ఉందనేది కార్నెల్ విశ్వవిద్యాలయానికి చెందిన లీసా కాల్టెన్గర్, జార్ ఓ మెల్లి జేమ్స్ అనే శాస్త్రవేత్తల ప్రతిపాదన. అదే నిజమైతే మాత్రం ప్రస్తుతం మన భూమిపై ఉన్న వాతావరణ సాంద్రతలో పదో వంతు మాత్రమే కొత్త గ్రహాలలో ఉండే అవకాశముంది. అలాంటప్పుడు అక్కడ జీవం మనుగడకు అవకాశాలు ఎలా ఉంటాయనేది ప్రశ్నార్థకమే!

అయితే ఈ మధ్య కాలంలో కొన్ని సముద్ర జీవులు (కోరల్స్ వంటివి) అతి నీలలోహిత కిరణాలను గ్రహించి, వాటిని ప్రమాదరహితంగా తిరిగి పంపుతున్నాయని కనుగొన్నారు. ఒకవేళ అలాంటి పరిస్థితులుంటే ట్రాపిస్ట్-1 గ్రహవ్యవస్థలో కూడా జీవం ఉండే అవకాశముంది. అక్కడ జీవరాశి నివసించటానికి అనువైన పరిస్థితులు నిజంగా ఉంటే ఆ జాడలు గ్రహశకలాల ద్వారా కనుగొనే అవకాశముంటుంది.



చిలీలోని 'ట్రాపిస్ట్' టెలిస్కోప్

ఉదాహరణకు జూపిటర్ ఉపగ్రహం యూరోపా, శని ఉపగ్రహం ఎన్‌సెల్డస్‌లలో ఉష్ణోగ్రతలు చాలా తక్కువ ఉంటాయి. అందువల్ల అక్కడ పరిణతి చెందిన జీవులు లేకపోయినా సూక్ష్మక్రిములు ఉండే అవకాశముందనేది శాస్త్రవేత్తల భావన. ఆ కారణం వల్లే వారు ఈ రెండు ఉపగ్రహాల సమీపం నుంచి వచ్చే అంతరిక్ష శకలాలను జాగ్రత్తగా గమనిస్తున్నారు. అలాగే ట్రాపిస్ట్-1 గ్రహ వ్యవస్థ సమీపంలోని శకలాలను గమనించటం ద్వారా కూడా అక్కడి పరిస్థితులను తెలుసుకోవచ్చనేది శాస్త్రవేత్తల ఆలోచన. వీరి ఆలోచనలు ఫలవంతమై ఈ విశాల విశ్వంలో మనం ఒంటరిగా ఉన్నామో లేదో తెలిసే రోజు అతి త్వరలోనే వస్తుందని ఆశిద్దాం.

**- సి.వి.ఎల్.ఎన్. ప్రసాద్**

ఫోటోలు : నాసా

Raju


గ్రాండ్ వెల్‌కమ్ సార్!
కూల్ కూల్ కూలర్ కో.


మీ పత్రికలో కథకి పారితోషికం ఎంతండీ?
కథకి పదివందలకు తక్కువ తీసుకోం!
ఎడిటర్


ఆయన రిటైరయ్యారు... రేపటి నుంచి వాచ్‌మెన్ అవసరం లేదు. వేరే ఎక్కడైనా పని చూసుకో!!


సుబ్బారావుని తీసుకుపోవడానికా? వెరీగుడ్.
ఆ ఎడమవైపు మూడో ఇల్లే!


సమ్మర్ క్యాంప్
మీ
మాతృ భాష
నేర్పబడును




బంధువులు మొక్కు తీర్చుకోవడం కోసం రమ్మంటే ఇష్టం లేకున్నా బలవంతంగా వారితో పాటు బయలుదేరి, ప్రయాణంలో అనుకోకుండా జరిగిన మార్పుల కారణంగా విశాఖపట్నం వెళ్లాడు ఓ కుర్రాడు. అక్కడ 'సబ్‌మెరైన్' మ్యూజియంను చూడగానే ఆ కుర్రాడిలో ఒక ఐడియా తళుక్కున మెరిసింది. ఆ ఐడియానే 'ఘాజీ'! దాన్ని తెర మీద చూసుకోవడానికి అతడికి ఐదేళ్లు పట్టింది. ఆ కుర్రాడి పేరు సంకల్ప్ (31). ఆ చిత్ర దర్శకుడు. ఒక సముద్ర యుద్ధాన్ని తెరకెక్కించిన మొట్టమొదటి భారతీయ సినిమాగా ఇప్పుడది అందరి ప్రశంసల్నీ అందుకుంటోంది. కేవలం 20 లక్షల రూపాయలతో ప్రారంభమైన అతడి సంకల్పం 'ఇంతింతై వటుడింతై' అన్నట్లుగా పెరిగింది. అది సినీ పెద్దల నమ్మకాన్ని చూరగొనడానికీ, రెండు భాషల్లో 30 కోట్ల ప్రాజెక్టుగా మారడానికీ మధ్య మరో 'ఘాజీ' సినిమాని తలపించేంత కథ ఉంది. "ఒక ఐడియాను నమ్మి, దాని కోసం నేను అహర్నిశలు పడ్డ కష్టమే ఈ రోజు నాకీ గుర్తింపు తెచ్చింది" అంటున్న 'ఘాజీ' దర్శకుడు సంకల్ప్ చెబుతున్న విశేషాలివి...

# ఐదేళ్ల ఘాజీ కల నెరవేరిందిలా...

నా పూర్తి పేరు సంకల్ప్‌రెడ్డి. హైదరాబాద్ శివారులోని ఇబ్రహీంపట్నం దగ్గరున్న రాయప్రోలు గ్రామం మాది. అయితే నేను మలక్‌పేటలో పుట్టి పెరిగాను. మా నాన్న సదయ్య వీర్రెడ్డి రియల్ ఎస్టేట్ వ్యాపారి. నా చదువంతా హైదరాబాద్‌లోనే జరిగింది. సెయింట్ జోసెఫ్ స్కూల్ (కింగ్‌కోఠి), ద్వారకా హైస్కూల్ (దోమలగూడ)లలో టెన్త్ వరకు చదివిన తర్వాత నారాయణగూడలోని రత్న జూనియర్ కాలేజీలో ఇంటర్ ఎంపీసీ చేశాను. ఇబ్రహీంపట్నంలోని సీవీఆర్ కాలేజీలో 2006లో (సీఎస్ఈ బ్రాంచ్) ఇంజనీరింగ్ పూర్తిచేసిన తర్వాత అందరిలాగే అమెరికా వెళ్లాలనుకున్నాను. కానీ వివిధ కారణాల వల్ల నాకు వీసా రాలేదు. నా మిత్రులంతా అమెరికాకు వెళ్లిపోతే నేను మాత్రం గత్యంతరం లేక ఇక్కడే 'ఇన్ఫోటెక్' అనే సాఫ్ట్‌వేర్ కంపెనీలో చేరాను. ఆరునెలల తర్వాత ఆ ఉద్యోగం చేయలేననిపించింది. దాంతో మా నాన్న రియల్ ఎస్టేట్ పనులు అప్పగించారు. ఆ పని కూడా నాకు అస్సలు నచ్చలేదు. నేను ముందు నుంచి ఇంట్రావర్ట్‌ని. ఎవరితోనూ పెద్దగా కలవను. నా ప్రపంచం నాదే. అందరు కుర్రాళ్లలాగే సినిమాలు చూసేవాడిని కానీ వాటిపై పెద్దగా అవగాహన ఉండేది కాదు.

### ఆస్ట్రేలియాలో సినిమావైపు అడుగులు...

రెండేళ్ల తర్వాత (2008) ఇంట్లో వాళ్ల బలవంతం మీద ఆస్ట్రేలియాలో ఎంబీఏ చేసేందుకు వెళ్లాను. అక్కడ గ్రిఫిత్ యూనివర్శిటీలో చేరాను. ఎంబీఏ చేసింతర్వాత ఏం చేయాలి? అనే ప్రశ్న వచ్చింది. ఏ కంపెనీలోనైనా ఉద్యోగం చేయాలి... లేదంటే సొంతగా ఏదో ఒక కంపెనీ పెట్టుకోవడమో, మా నాన్న బిజినెస్ చూసుకోవడమో చేయాలి. ఇవేవీ నాకు ఇష్టం లేకే కదా రెండేళ్లు ఖాళీగా ఉన్నది. ఈ ఆలోచనలలో ఉండగానే మొదటి సెమిస్టర్ పూర్తయ్యింది. మా యూనివర్శిటీ క్యాంపస్‌లో ఒక పక్కన 'ఫిల్మ్ స్కూల్' అనే బోర్డ్ ఉండేది. ఎంబీఏపై నాకు ఎలాగూ శ్రద్ధ లేదు కాబట్టి ఫిల్మ్‌మేకింగ్ కోర్సులో చేరడం బెటర్ అనిపించింది. కాని ఎంబీఏ కన్నా ఫిల్మ్‌కోర్సులకు ఫీజు ఎక్కువ. దాని కోసం పెట్రోల్ బంకుల్లో పార్ట్‌టైమ్ జాబ్ చేస్తూ సంపాదించడం నాకస్సలు ఇష్టం లేదు. అందుకే నాన్‌వెజ్ తినడం మానేయడం లాంటి పద్ధతుల్లో ఖర్చులు తగ్గించుకుని ఆ విధంగా మిగిలిన డబ్బుతో ఫిల్మ్‌కోర్సుల ఫీజును మేనేజ్ చేసేవాణ్ణి. మా ఇంట్లో వాళ్లు మాత్రం నేను ఆస్ట్రేలియాలో ఎంబీఏనే చేస్తున్నాననుకున్నారు.

మొట్టమొదటిసారిగా నేను ప్రపంచ సినిమాను చూసింది, అర్థం చేసుకున్నది అక్కడే. కోర్సులో భాగంగా హాలీవుడ్ సినిమాలు విపరీతంగా చూసేవాణ్ణి. సినిమాలపై ప్రొఫెసర్లతో, తోటి విద్యార్థులతో చర్చలు సాగేవి. ప్రాజెక్టులలో భాగంగా కొన్ని షార్ట్‌ఫిల్మ్స్ కూడా తీశాను. అక్కడే మా మాస్టర్ అన్న ఒక మాట నా మైండ్‌లో ఫిక్స్ అయ్యింది. అదేమిటంటే 'బీ ద ఫస్ట్ ఆర్ బీ ద బెస్ట్'.

### అనుకోకుండా అన్న 'వరం'...

ఆస్ట్రేలియాలో చదువు ముగించుకుని రెండేళ్ల తర్వాత ఇంటికి తిరిగొచ్చాను. అక్కడ నేను ఎంబీఏ చదవలేదని, ఫిల్మ్‌కోర్స్ చేశానని

చెబితే ఇంట్లోవాళ్లు షాకయ్యారు. అప్పటికే సినిమా తీయాలని ఫిక్సయ్యాను. చిన్న చిన్న సినిమాలకు అసిస్టెంట్ డైరెక్టర్‌గా చేస్తూ పని నేర్చుకుంటూనే రకరకాల ప్రేమకథలు తయారుచేసుకున్నాను. మరోవైపు లోయర్ టాంక్ బండ్ దగ్గర 'క్రిస్టల్ 3సి' పేరిట ఒక కంప్యూటర్ గ్రాఫిక్స్ స్టూడియో కూడా ఏర్పాటు చేసుకున్నా. సినిమాలంటూ తిరుగుతున్నానని మా నాన్న 2012లో నాకు పెళ్లి చేశారు. నా భార్య పేరు కీర్తి రెడ్డి. ఫ్యాషన్ డిజైనర్. ఒకరోజు నా భార్య సిస్టర్‌వాళ్లు మొక్కు తీర్చుకునేందుకు అన్నవరం వెళ్లాలని ప్లాన్ చేశారు. ఆ సమయానికి నా భార్య ప్రెగ్నెంట్‌గా ఉండటంతో నా భార్య కాకుండా నేను వారితో వెళ్లాల్సి వచ్చింది. నిజానికి మేమంతా అన్నవరం నుంచి తిరిగి హైదరాబాద్‌కు రావాలి. అయితే ప్రయాణంలో చిన్న మార్పు జరిగి అనుకోకుండా విశాఖపట్నం వెళ్లాం. ఆ రోజు నాకు బాగా గుర్తుంది. అది 23 నవంబర్ 2012. అక్కడి బీచ్‌రోడ్‌లో ఉన్న సబ్‌మెరైన్‌ను చూసిన తర్వాత నాలో ఒక ఆలోచన తళుక్కున మెరిసింది. ఫిల్మ్‌స్కూల్‌లో మా మాస్టర్ చెప్పిన మాటలు 'బీ ఫస్ట్ ఆర్ బీ బెస్ట్' అనే మాటలు గుర్తొచ్చాయి. ఆ తర్వాత ఏడాదిన్నర పాటు సబ్‌మెరైన్స్ మీద పరిశోధన చేశాను. విశాఖలోని సబ్‌మెరైన్ మ్యూజియం క్యూరేటర్ ఫణిరాజ్‌గారితో చాలాసార్లు ఇంటరాక్ట్ అయ్యాను. చాలామంది రిటైర్డ్ నేవీ ఉద్యోగులను కలిసి నాకు అవసరమైన ఇన్‌పుట్స్ తీసుకుని ఎట్టకేలకు 'ఘాజీ' కథకు ఫిక్షన్ జోడించి స్టోరీబోర్డ్ తయారుచేశాను.


> 'సబ్‌మెరైన్' సెట్ వేయాలంటే ఖాళీ స్థలం కావాలి. తక్కువ అద్దెకు స్థలం ఎక్కడా అందుబాటులో లేకపోవడంతో లోయర్ టాంక్‌బండ్ దగ్గర మూసేసి ఉన్న ఒక బిల్డింగ్‌పైన ఐదో అంతస్తులో ప్రొడక్షన్ డిజైనర్ శివంరావుతో సెట్ వేయించాను. విజువల్ ఎఫెక్ట్స్ తెలిసిన నా మిత్రుడు వాసుదేవరెడ్డి సాయంతో, 'సూత్రధారి' థియేటర్‌కు చెందిన కొంతమంది థియేటర్ ఆర్టిస్టులతో 'ఘాజీ' షూటింగ్ ప్రారంభించాను.



'ఘాజీ' సెట్‌లో...

### ఐదంతస్తుల భవనంపై 'ఘాజీ' సెట్ ...

అతి తక్కువ ఖర్చుతో నా కథను తెరకెక్కించాలనేది నా ఆలోచన. మా నాన్నను బతిమాలి 20 లక్షల రూపాయలు తీసుకున్నాను. 'సబ్‌మెరైన్' సెట్ వేయాలంటే ఖాళీ స్థలం కావాలి. తక్కువ అద్దెకు స్థలం ఎక్కడా అందుబాటులో లేకపోవడంతో లోయర్ టాంక్‌బండ్ దగ్గర మూసేసి ఉన్న ఒక బిల్డింగ్‌పైన ఐదో అంతస్తులో ప్రొడక్షన్ డిజైనర్ శివంరావుతో సెట్ వేయించాను. విజువల్ ఎఫెక్ట్స్ తెలిసిన నా మిత్రుడు వాసుదేవరెడ్డి సాయంతో, 'సూత్రధారి' థియేటర్‌కు చెందిన కొంతమంది థియేటర్ ఆర్టిస్టులతో 'ఘాజీ' షూటింగ్ ప్రారంభించాను. నా ప్రయత్నం గురించి తెలిసిన వాళ్లంతా చివరికి నా ఫ్రెండ్స్‌తో సహా అందరూ నన్నో పిచ్చోడిలా చూశారు. సెట్ అంటే నేలపైన ఉంటుంది కానీ లిఫ్ట్‌లో మేడపైకి వెళ్లడమేమిటని ఎగతాళి చేశారు. ఎవరేమంటేనేం 25 లక్షల రూపాయలు ఖర్చుచేసి కొన్ని షాట్స్ తీసి, షోరీల్ ఒకటి తయారుచేశాను. ఇక నిర్మాతల కోసం వేట ప్రారంభమైంది. కోటి రూపాయలతో సినిమా తీస్తానంటే ఎవరూ నమ్మలేదు. అప్పటికే నా స్క్రిప్టును బాలీవుడ్ నటుడు కెకె మీనన్‌కు మెయిల్ చేశాను నా సినిమాలో నటించమని కోరుతూ. స్క్రిప్టు మొత్తం చదివి ఆయన కూడా ఇది పెద్ద సినిమా అని, కోటి రూపాయల్లో తీయలేవని నాకు నచ్చజెప్పడానికి ప్రయత్నించారు.

చాలామంది స్క్రిప్టు చదివి మార్పులు చేర్పులు సూచించారు. వారిలో 'అష్టాచెమ్మా' నిర్మాత రామ్మోహన్‌గారొకరు. ఆయన ఆ స్క్రిప్టును దగ్గుబాటి రానా, సురేష్‌బాబులకు వినిపిస్తే వాళ్లు కూడా కొన్ని మార్పులు చెప్పారట. అయితే ఆ మార్పులు చేయడం నాకిష్టం లేదని చెప్పి వచ్చేశాను. అదే సమయంలో మా నాన్నగారి మిత్రుడు, న్యాయవాది నిరంజన్‌రెడ్డి నన్ను ప్రముఖ నిర్మాత ప్రసాద్ వి పొట్లూరిగారికి (పీవీపీ) పరిచయం చేశారు. వారికి నా ప్రాజెక్ట్ నచ్చడం, రానా ఒప్పుకోవడంతో 'ఘాజీ' పట్టాలెక్కింది. అప్పటి నుంచి అన్నీ కలిసొచ్చాయి. పీవీపీవాళ్లే సినిమాను తెలుగుతో పాటు హిందీలో కూడా తీద్దామనడమేగాక, కెకె మీనన్, అతుల్ కులకర్ణి, తాప్సీ, ఓంపురిలాంటి గొప్ప నటీనటులను తీసుకొచ్చారు. జాతీయ అవార్డులు పొందిన ఎడిటర్ శ్రీకర్‌ప్రసాద్‌తో పాటు అనేకమంది గొప్ప సాంకేతిక నిపుణులు ఈ ప్రాజెక్టులో పాలు పంచుకోవడం అలాగే జరిగింది. ఈసారి కూడా లోయర్ టాంక్‌బండ్‌లోనే ఒక ఫంక్షన్‌హాలులో పెద్ద సెట్ వేశాం. అక్కడున్న స్విమ్మింగ్‌పూల్‌లోనే అండర్‌వాటర్ సీన్లు తీశాం. 60 రోజుల పాటు ఏకధాటిగా షూటింగ్ చేసి ఎక్కడా కాంప్రమైజ్ కాకుండా 'ఘాజీ'ని నేననుకున్న విధంగా తెరకెక్కించాను.

సినిమా విడుదలైన తర్వాత చిత్రపరిశ్రమకు చెందిన ప్రముఖులంతా 'గొప్ప సినిమా', 'హాలీవుడ్ రేంజ్‌లో ఉంది' అని పొగుడుతుంటే నా ఐదేళ్ల కష్టం ఫలించిందనిపించింది. రెగ్యులర్ సినిమాలు తీయడం నాకు అస్సలు చేతకాదు. రెండోది కూడా భిన్నమైన సినిమా తీసేందుకే ప్రయత్నిస్తా. అది ఏమిటో, ఎప్పుడో ఇప్పుడే చెప్పలేను.



- మణిరత్నం, క్రిష్ సినిమాలంటే చాలా ఇష్టం.
- క్రిష్ దగ్గర అసిస్టెంట్‌గా చేరాలని ఉండేది. 'ఘాజీ' చూసి క్రిష్ నన్ను అభినందించినప్పుడు 'సార్ మొదట్లో మీ దగ్గరే అసిస్టెంట్‌గా చేరాలనుకున్నా' అంటే 'నా దగ్గర చేరకపోవడమే మంచిదైంది' అని నవ్వారు క్రిష్.
- ఈ ప్రాజెక్టుకు డబ్బు అవసరమైనపుడు నా భార్య నగలు అమ్మి సర్దుబాటు చేసింది.
- హాలీవుడ్ సినిమాలు ఎక్కువగా చూస్తాను. 'ఘాజీ' మీద ఆ ప్రభావం ఉంది.

**● చల్లా శ్రీనివాస్**

# cyber క్రైమ్

**'మంచి ఉద్యోగం చేస్తున్నావు... నెలకు లక్షన్నర సంపాదిస్తున్నావు... ఇంక పెళ్లెప్పుడు చేసుకుంటావో ఏమో... నీకు సంబంధాలు వెతకలేక చస్తున్నా' ఆఫీసుకు బయల్దేరుతున్నపుడు అమ్మ అన్న మాటలు రజిత చెవిలో మారుమోగుతున్నాయి.**

# ఆన్‌లైన్ పెళ్లికొడుకు

గత కొన్నాళ్లుగా రోజూ వింటున్న మాటలే ఇవి. తనకూ పెళ్లి చేసుకోవాలనే ఉంది. సాఫ్ట్‌వేర్ కొలువులో చేరిన మొదటి రెండేళ్లు సీటులో కుదురుకోవడానికే సరిపోయింది. 'ఆ ప్రాజెక్ట్... ఈ ప్రాజెక్ట్' అంటూ మరో నాలుగేళ్లు సంస్థలో పొజిషన్ కోసం పరుగుతోనే సరిపోయింది. ఆ రేసులో పరుగెత్తి... పరుగెత్తి... వెనక్కి తిరిగి చూసుకుంటే 32 ఏళ్ల వయసు కన్పిస్తోంది. వామ్మో... తెలియనే లేదు.

ఈమధ్య తల్లి సతాయింపు ఎక్కువ కావడంతో ఇక తప్పదనుకుని మాట్రిమోనియల్ బయోడేటా తయారుచేసే పనిలో పడింది రజిత.

●●●

తండ్రి చిన్నపుడే చనిపోవడంతో తల్లే అంతా తానై పెంచింది రజితను. పైగా ఆర్థికంగా ఏ లోటూ లేకపోవడం, ఒక్కతే కూతురు కావడంతో గారాబంగా పెరిగింది.

"ఏమే రజితా... బయోడేటా అప్‌లోడ్ చేస్తానన్నావ్... చేశావా?"

"ఈ రోజు చేసేస్తానమ్మా... నీకెందుకు బెంగ. రేపటిలోగా వంద మంది అబ్బాయిలు క్యూ కడతారు చూడు..." అంటూ హుషారుగా ఈల వేస్తూ చెప్పింది రజిత.

నిజంగానే ఆ రోజు పేరున్న ఒక మాట్రిమోనియల్ వెబ్‌సైట్‌లో తన ప్రొఫైల్‌ను అప్‌లోడ్ చేసింది రజిత. తనకెలాంటి వరుడు కావాలనుకుంటోందో ఆ వివరాలను క్షుణ్ణంగా పేర్కొంది. ఆమె ప్రొఫైల్ చూసి చాలామందే రిక్వెస్టులు పంపించారు.

●●●

లాప్‌టాప్ ముందు కూర్చుని మాట్రిమోనియల్ వెబ్‌సైట్‌లోని తన పేజ్‌ను ఓపెన్ చేసింది ఒకరోజు. కుప్పలు తెప్పలుగా ఉన్న రిక్వెస్టులను పరిశీలిస్తున్న రజిత చూపు ఒక ఫోటోపై పడింది. ఆకర్షణీయమైన రూపంలో ఉన్న ఆ యువకుడి వివరాలను పరిశీలించడం ప్రారంభించింది.

తన పేరు విక్రాంత్ అని, బ్రిటన్‌లో పెరిగిన భారత సంతతికి చెందిన పౌరుడినని, ప్రస్తుతం ఇరాక్‌లోని ఐక్యరాజ్యసమితి విభాగంలో వైద్యుడిగా పనిచేస్తున్నానని అందులో రాశాడు.

"అమ్మా ఈ కుర్రాడు ఎలా ఉన్నాడే..." తల్లికి విక్రాంత్ ఫోటో చూపుతూ అడిగింది రజిత.

"కుర్రాడు బాగున్నాడు. మీ ఇద్దరి జోడీ కూడా బాగుంటుంది..."

"అలాగైతే వాడే నా మొగుడని ఫిక్సయిపో..." అంటూ చిలిపిగా కన్ను గీటింది.

"ఏంటా తొందర... ముందు అతడి వివరాలు కనుక్కో..."

"ఓకే.." అంటూ కాబోయే వరుడి ఫోన్ నెంబర్‌కు ఫోన్ చేసింది రజిత.

●●●

"ఏంటీ నిన్న వాట్సాప్‌లోకి రాలేదు..."

"ఆఫీసులో హెక్టిక్ వర్క్... ఫీలయ్యావా..."

"అదేంటి రజిత అలా అంటావ్... నేను అర్థం చేసుకోగలను"

"ఇంకా ఏంటి విశేషాలు విక్రాంత్. ఇరాక్‌లో



ఎలా ఉంది... ఇండియా ఎప్పుడొస్తున్నావ్..."

"ఎవ్రీథింగ్ ఈజ్ ఫైన్. ఇండియాకు వచ్చిన తర్వాత స్వంతంగా ఒక ఆసుపత్రి పెట్టాలనుకుంటున్నా. అన్నట్టు మర్చిపోయా... కోటి రూపాయలు ఖరీదు చేసే వైద్య పరికరాలను ఇండియాకు పంపిస్తున్నా... ఇఫ్ యూ డోంట్ మైండ్ వాటిని రిసీవ్ చేసుకుని భద్రంగా ఉంచాలి..."

"ఓకే నో ప్రాబ్లమ్..."

"రెండు నెలల్లో ఇండియాకు వస్తా కదా... వచ్చిన వెంటనే పెళ్లి చేసుకుందాం. ఓకేనా"

"ఓకే బై..."

రజిత, విక్రాంత్ నడుమ క్లోజ్‌నెస్ బాగా పెరిగింది. వాట్సాప్‌లో ప్రతీరోజూ తెగ చాటింగ్ చేసుకుంటున్నారు.

●●●

పది రోజుల తర్వాత రజిత ఇంటికి ఒక మహిళ ఫోన్ చేసింది.

"మామ్... నేను ఢిల్లీ కస్టమ్స్ విభాగం నుంచి ఫోన్ చేస్తున్నా... రజిత అంటే...?"

"ఎస్... నేనే"

"విదేశాల నుంచి మీ పేరు మీద గిఫ్ట్ పార్శిల్ వచ్చింది. అయితే కస్టమ్స్ సుంకం చెల్లించలేదు"

"ఇప్పుడేం చేయాలి..."

"నేనొక అకౌంట్ నెంబర్ ఇస్తాను. అందులో 1 లక్షా 20 వేల రూపాయలు డిపాజిట్ చేయండి"

విక్రాంత్ విషయం ముందే చెప్పాడు కాబట్టి ఆ మహిళ సూచించిన అకౌంట్‌లో రజిత రూ.1.2 లక్షలు డిపాజిట్ చేసింది.

ఆ తర్వాత రెండురోజులకు మరో వ్యక్తి ఫోన్ చేశాడు. తాను యాంటీ టెర్రరిస్టు సెల్ నుంచి మాట్లాడుతున్నాననీ, పార్సిల్‌పై అనుమానం ఉందనీ, దాన్ని క్లియర్ చేయాలంటే ఫీజు కట్టాలనీ చెప్పాడు. అతను చెప్పినట్లే రజిత మరికొంత డబ్బు ఆన్‌లైన్ ద్వారా బ్యాంకు ఖాతాలో వేసింది. అదే రోజు ఇన్‌కంటాక్స్ శాఖ, ఇంటర్నేషనల్ ఫ్లైట్ మానిటరింగ్ అంటూ మరికొన్ని విభాగాల నుంచి ఫోన్లు వచ్చాయి.

విక్రాంత్‌కు ఫోన్ చేస్తే 'అవన్నీ రెగ్యులర్ ఫార్మాలిటీసేనని, తాను ఇండియా వచ్చిన తర్వాత ఆ డబ్బు అడ్జస్టు చేస్తానని చెప్పడంతో రజిత వివిధ ఖాతాలకు పలుమార్లు 47 లక్షల రూపాయల వరకు ట్రాన్స్‌ఫర్ చేసింది. స్నేహితుల నుంచి అప్పు తీసుకుని కొంత, బ్యాంకులో పర్సనల్ లోన్ తీసుకుని మరికొంత పంపింది. ఎంత నగదు పంపినా ఏదో ఒక వంకతో ఇంకా డబ్బులు పంపమని వారు కోరడంతో రజితకు అనుమానం వచ్చింది.

ఈలోగా విక్రాంత్ ఫోన్ కలవడం మానేసింది. అప్పటికి తాను మోసపోయానని తెలుసుకుని హైదరాబాద్ సైబర్ క్రైమ్ పోలీసులకు ఫిర్యాదు చేసింది రజిత.

పోలీసులు ఆమె చెప్పిన వివరాలను పరిశీలించారు. మోసం అంతా ఢిల్లీ కేంద్రంగా జరిగినట్లు గుర్తించారు. ఢిల్లీ పోలీసుల సహకారంతో రజితను నిలువునా ముంచిన విక్రాంత్ అలియాస్ మైఖేల్‌ను ఢిల్లీలో అరెస్టు చేశారు. మైఖేల్ అనే నైజీరియన్ అత్యంత చాకచక్యంగా వ్యవహరించి తన ఫోటోకు బదులుగా ఒక అందమైన యువకుడి ఫోటోను మాట్రిమోనియల్ సైట్‌లో అప్‌లోడ్ చేసి ఆ తర్వాత కథ నడిపినట్లు గుర్తించారు పోలీసులు. ఆన్‌లైన్‌లో జరిగే ఇలాంటి మోసాల పట్ల యువతరం అప్రమత్తంగా ఉండాలని పోలీసులు హెచ్చరించారు.

**- వేముల సత్యనారాయణ**
**99854 88800**



# ఓం నమో వేంకటేశాయ

దైవమ్

**కోట్లాది మంది ప్రజల్లాగే వెనిగళ్ల ఆనందప్రసాద్ కూడా వెంకటేశ్వరస్వామి భక్తులు. హైదరాబాద్ నుంచి రెండుసార్లు కాలినడకన తిరుమల వెళ్లొచ్చారు. భవ్య సంస్థల అధినేతగా హైదరాబాద్‌లో తాను నిర్మించిన రెండు వెంచర్స్‌లో రెండు వెంకటేశ్వరస్వామి ఆలయాలను కట్టిన ఘనత కూడా ఆయనకు ఉంది.**

"ఎవరైనా ఒక్క దేవుడిని నమ్ముకుంటేనే బాగుంటామని నా మిత్రుడు, ప్రముఖ నటుడు బ్రహ్మానందం అంటుంటారు. నా ఆలోచన కూడా అదే. అందుకే గత 35 ఏళ్లుగా వెంకటేశ్వరస్వామినే నమ్ముకున్నాను. కూకట్‌పల్లి నిజాంపేటలో 'భవ్యాస్ ఆనందం' కట్టడానికి స్థలం కొని అక్కడ ఓ చెట్టు కింద కూర్చుని ఉన్నపుడు ఓ పెద్దాయన వచ్చి 'ఈ చెట్టు గురించి తెలుసా మీకు? ఇక్కడ లక్ష్మీదేవి కొలువై ఉంటుందని ఈ ఊరివారి నమ్మకం. దీన్ని నీకు ఈ యజమానులు ఎందుకు అమ్మారో నాకు తెలియదు. వాళ్లకి అమ్ముకోవాల్సిన అవసరం కూడా లేదు. కానీ ఈ స్థలం కొన్నాకే వాళ్లకు కలిసొచ్చింది' అని చెప్పారు. ఆ మాటలు నన్ను వెన్నాడుతుండిపోవడంతో గేటెడ్ కమ్యూనిటీకోసం ప్లాన్ గీసేటప్పుడు అందులో ఒక గుడి కట్టాలని సంకల్పించుకున్నా. వేంకటేశ్వరస్వామి, శ్రీదేవి, భూదేవి, గరుడాళ్వారు సన్నిధులను నిర్మించాను. కంచి శ్రీశ్రీశ్రీ జయేంద్రసరస్వతి స్వాములు వచ్చి మూలవిరాట్టు ప్రతిష్టాపన చేశారు. పది నిమిషాలు మాత్రమే గుడిలో ఉంటానన్న ఆయన దాదాపు నాలుగైదు గంటలు మాతో గడపడాన్ని మర్చిపోలేను. ఏటా ఫిబ్రవరిలో అంగరంగవైభవంగా బ్రహ్మోత్సవాలు చేస్తాం.

తొమ్మిదో బ్రహ్మోత్సవం జరిగే సమయంలో నాకు చాలా పెద్ద సమస్య వచ్చింది. ఇక కోలుకోనేమోనని భయపడ్డాను. భగవంతుడి ముందు నిలబడి 'స్వామీ.. ఇక నీకు బ్రహ్మోత్సవాలు చేయలేనేమో' అని నమస్కారం చేసుకుని కన్నీళ్లు పెట్టుకున్నా. నా భార్య కృష్ణకుమారి విలవిల్లాడిపోయింది. అయితే ఆ దేవుడు మమ్మల్ని కష్టాల నుంచి బయటపడేశాడు. పదో బ్రహ్మోత్సవాన్ని ఎప్పటిలాగే అంగరంగ వైభవంగా చేయగలిగాను. ఈ ఫిబ్రవరితో 13 బ్రహ్మోత్సవాలు పూర్తయ్యాయి. కూకట్‌పల్లి ఉషాముళ్లపూడి ప్రాంతంలో మేం నిర్మించిన భవ్యాస్ తులసివనంలోనూ మరో వేంకటేశ్వరస్వామి ఆలయాన్ని నిర్మించాను. బయటి భక్తులు కూడా వచ్చే విధంగా కట్టాం. తిరుమలలో ఉన్నట్టే ఉత్తర ద్వారం, వైకుంఠద్వారం ఇక్కడ ప్రత్యేకం. మేలో బ్రహ్మోత్సవాలు చేస్తాం. కోనేరు కూడా నిర్మించాం.

మా రెండు గుడులకూ తితిదే వారే విగ్రహాలను ఇచ్చారు. అక్కడ జరిగినట్టుగానే వైఖానస ఆగమం ప్రకారం ఇక్కడ నిత్యపూజలు జరుగుతాయి. రెండు గుడులలోనూ బ్రహ్మోత్సవాలు జరిగే సమయంలో నలభైరోజుల పాటు నేను దీక్ష తీసుకుంటా. రెండు సార్లు హైదరాబాద్ నుంచి తిరుమలకు కొంతమందిమి కలిసి కాలినడకన వెళ్లాము. 17 రోజుల్లో పాద యాత్ర పూర్తిచేశాం. ఖమ్మం జిల్లా బయ్యారం మండలం గంధంపల్లి నుంచి నెలకు రూ.150 జీతం కోసం హైదరాబాద్‌లో అడుగుపెట్టిన నేను రెండు గుడులు కట్టడమన్నది స్వామివారి కృపగానే భావిస్తాను."

**- డా.చల్లా భాగ్యలక్ష్మి**



# పువ్వుల్లో పువ్వులు

ఇల్లు ఎలా ఉందని కాదు.. దాన్ని ఏ విధంగా అలంకరించామన్నదే ముఖ్యం. వస్తువులను సరిగ్గా సర్దకపోతే ఎంత పెద్ద ఇల్లయినా చూడడానికి అస్సలు బాగోదు. అదే కొంచెం సృజనాత్మకతతో ఆలోచిస్తే చిన్న ఇంటిని కూడా ఎంతో అందంగా అలంకరించుకోవచ్చు... అలా అలంకరించేందుకు పూలకుండీలు మంచి చాయిస్. అందులోనూ పువ్వుల్లా ఉండే ఈ పూలకుండీలు ఇంకా మంచి చాయిస్. 'పువ్వుల్లోనే మళ్లీ పూలు పూసినట్టుగా.. దానిమ్మపండు పైన పిట్టలు వాలి గింజలు తింటూ కిచకిచలు పెడుతూ గోల చేస్తున్నట్టుగా.. నల్లని కుండ చుట్టూ తీగ పువ్వులు చుట్టుకుని విరబూసినట్టుగా.. తన హృదయంలోని ఖాళీని పూలతో పూరించమని ఒత్తుగా విచ్చుకున్న కమలం ఆశగా చూస్తున్నట్టుగా..' ఎంతో ఓర్పుతో.. అంతకు మించిన నేర్పుతో చెక్కిన ఈ కళాకారుల ప్రతిభకు సలామ్ చెప్పకుండా ఉండలేం! వీటిల్లో గుబాళించే తాజా పూలను పెట్టి అలంకరిస్తే.. ప్రత్యేకంగా రూమ్ ఫ్రెషనర్స్ వాడాల్సిన అవసరం కూడా ఉండదు. ఇంటికి వచ్చిన అతిథులు 'వావ్..' అంటూ మీ కళాభిరుచిని మెచ్చుకోవాలంటే ఖరీదైన ఇంటీరియర్స్‌పై ఖర్చు చేసేకంటే.. వీటిని కొని.. సరైన చోట ఫిక్స్ చేసేయండి! ఇవి మీ ఇంటిని ఒక ఉద్యానవనంలా మార్చేసి ప్రత్యేకమైన లుక్‌ను తెస్తాయి.

# చెప్పమ్మా.. చెప్పు



సిండ్రెల్లా అందాన్ని చూసి మోహించిన యువరాజుకు ఆమెను దక్కేలా చేసింది ఒక చెప్పు! తండ్రి మాట కోసం రాముడు అడవులకు వెళ్తే... రాజ్యపాలనా భారాన్ని భరతుడితో కలిసి పంచుకున్నాయి ఆయన చెప్పులు... చెప్పులకు 'చెప్పు'కోదగ్గ చరిత్ర ఉందని ఈ విషయాలే చెబుతున్నాయి. ఆ చెప్పులు ఎలా ఉంటాయో మనం చూడలేదు గాని కళ్లెత్తకుండా కాళ్లను మాత్రమే చూడాలనిపించేలా అనేక రకాల కొత్త చెప్పులు, షూలు ఇటీవల మార్కెట్లో చాలా కనిపిస్తున్నాయి. కుక్కపిల్ల.. చేప పిల్ల.. గిల్లోరు కర్ర.. కాదేదీ చెప్పుల డిజైనుకు అనర్హం అన్నట్టుగా కొత్త కొత్త డిజైన్లతో అదరగొట్టేస్తున్నారు చెప్పుల డిజైనర్లు. 'పొరపాటున అరటిపండు తొక్కమీద కాలేస్తేనే జారిపడతాం.. కదా అలాంటిది ఆ అరటిపండు తొక్కే చెప్పులా మారిపోతే..!', 'చెప్పులు తీసేసి గడ్డిలో నడిస్తే ఆరోగ్యానికి మంచిదంటారు వైద్యులు.. మరి చెప్పులపైనే గడ్డి మొలిచేస్తే..', 'చెరువులో దిగితే కాళ్లను కొరకాలని ప్రయత్నించే చేపలు.. కాళ్లకిందకి చెప్పులుగా చేరి.. చక్కిలిగింతలు పెడితే..' వినడానికి కొంచెం వింతగా ఉన్నా.. వీటిని నిజం చేసేలా అనేక రకాల కొత్త డిజైన్లను రూపొందించారు వారు. వీటన్నిటి సంగతేమో గాని నడుం దాకా ఉండే 'ప్యాంట్ షూస్' (యునీక్ కవర్స్ ఎక్స్‌టెన్షన్ షూస్).. వేసుకుంటే మాత్రం ఇక ప్యాంట్ వేసుకోవాల్సిన పని లేదు.. 'అబ్బా ఐడియా భలే ఉందే!' అనుకుంటున్నారు కదా.. కాని వాటిని వేసుకుని గుడికెళ్లేవారి పరిస్థితి ఏంటంటారు?!

# తిరిగి చూస్తారెవరైనా..!



సాధారణంగా మొబైల్ కిందపడినప్పుడు పగిలిపోకుండా ఉండేందుకు మొబైల్ కేసెస్‌ను వాడతాం. ముందుండే మొబైల్‌ను అనేక రకాల ప్రయోజనాల కోసం వాడుతున్నప్పుడు.. వెనకుండే కేసెస్‌ను మాత్రం అలా ఊరికే ఎందుకు వదిలేయాలి? అనుకున్నారో.. ఏమో గాని వాటిని కూడా కాన్వాస్‌గా మార్చి.. 'మల్టీపర్పస్ మొబైల్ కేసెస్'ను రూపొందిస్తున్నారు సృజనాత్మకత ఉన్న కొందరు డిజైనర్లు. బయట ఉన్నప్పుడు మొబైల్ ఫోన్‌లో ముఖం చూసుకోవాలంటే.. కెమెరాను ఆన్‌చేయాలి... అలా మాటిమాటికీ కెమెరా ఆన్‌చేస్తే బ్యాటరీ వృథా అవుతుంది. దాని బదులు మొబైల్ కేస్‌కే ఒక అద్దాన్ని అమరిస్తే బెటర్ అనుకున్నట్టున్నారు. ఈ 'మిర్రర్ కేసెస్' ఇప్పుడు మార్కెట్లో హాట్‌కేకుల్లా అమ్ముడవుతున్నాయి. వీటితో పాటు కత్తి, స్క్రూడ్రైవర్, లైటర్, హెడ్‌ఫోన్స్ హోల్డర్, ఓపెనర్, సిగరెట్ బాక్స్ లాంటి వస్తువులను పెట్టుకునేందుకు వీలుగా.. ప్రత్యేకంగా రూపొందించిన కేసెస్ కూడా మార్కెట్లో లభిస్తున్నాయి. అలాగే ముఖంలో కలిసిపోయి అచ్చం చెవిలా కనిపించే కేసెస్.. జారిపోకుండా వేళ్లకు గ్రిప్‌ను అందించే కేసెస్.. ఐస్‌క్రీమ్‌లా.. పుచ్చకాయలా.. టేప్‌రికార్డర్ క్యాసెట్లలా కనిపించే కేసెస్.. ఇలా ఎన్నో వినూత్నమైన మొబైల్ కేసెస్ ఇప్పుడు మార్కెట్లో కొలువుతీరి ఉన్నాయి.







## ఛాయా'చిత్రమ్'



"టామీ...! పల్స్ రేట్ తక్కువుంది ...
నువ్వు అరవడం పెంచాలి"

## కాలంతో పాటు ...




### • కలసి ఉంటే కలదు నరకం

"ఏమండి ... స్వర్గంలో భార్యాభర్తలను ఒకే దగ్గర ఉంచరట నిజమేనా?" సందేహం వెలిబుచ్చింది కాంతం.

"ఒకే దగ్గర ఉంచితే అది స్వర్గమెందుకు అవుతుందే పిచ్చిదానా" చెప్పాడు ఏడుకొండలు.

### • క్యా బాత్ హై!

భార్యంటే - దారి తెలిసి డ్రైవింగ్ తెలియని స్త్రీ.

భర్తంటే - డ్రైవింగ్ తెలిసి దారి తెలియని మొగాడు.

అందుకే ఇద్దరూ కలిసి ప్రయాణం చేయాలి!

# • మిక్చర్ పొట్లం

బొమ్మలు : **వెంకట్**

## మొదటి యువకుడు

"నిన్ను ప్రేమించిన మొదటి యువకుడ్ని నేనే కదా?" గోముగా అడిగాడు ప్రియుడు.

"అవును. మిగతావారంతా వయసు మళ్లినవారే" నిజాయితీగా ఒప్పుకుంది ప్రేయసి.

## మాటమీదే నిలుచున్నాను

"ఇకపై మద్యం ముట్టుకోనని ప్రమాణం చేశావు కదా .. మళ్లీ తాగుతున్నావేం?

"సరిగ్గా చూడు ... స్ట్రా వేసుకున్నాను."

## దూరాలోచన



"పార్వతీదేవి శివుడిని భర్తగా ఎందుకు ఎంచుకుందో నాలుగు కారణాలు రాయండి" అని చెప్పాడు టీచర్.

ఒక విద్యార్థి ఇలా రాశాడు.

"శివుడు జింక చర్మం ధరిస్తాడు కాబట్టి పార్వతికి బట్టలుతికే పని ఉండదు. తలపై గంగ ఉంటుంది కాబట్టి బిందె పట్టుకుని నీళ్లకు బయటకి వెళ్లనక్కర్లేదు. చంద్రవంక ఉంటుంది కాబట్టి కరెంటు ప్రాబ్లమ్ లేదు. కందమూలాలు తింటాడు కాబట్టి వంట వండే అవసరం అసలే ఉండదు .. ఈ కారణముల చేత పార్వతి శివుడిని వరించెను".

## ఆర్డరేసింది ఆవిడే



దేవుడు స్వర్గంలో ఉండే భార్యాభర్తలందరితో ఒక సమావేశం ఏర్పరచి ఆడవాళ్లను, మగవాళ్లను రెండు వరసలుగా నిలుచోమన్నాడు. తర్వాత భార్య మాట వినేవాళ్లంతా ఒక వరసగా, భార్య మాట విననివారంతా మరో వరసలో నిలుచోండి అన్నాడు. ఒక్కడు తప్పించి అంతా భార్య మాట వినే వరసలో నిలుచున్నారు.

"ఇంతమందిలో నువ్వు ఒక్కడివే భార్య మాట వినని వాడవన్నమాట" అడిగాడు దేవుడు.

"ఈ లైన్లో నిలుచోమని ఆర్డరేసింది మా ఆవిడేనండి" చెప్పాడు ఆ భర్త.

## అస్తమానం మార్చలేక!



"నీ వయసు 70 ఏళ్లకు తక్కువుండదు. దరఖాస్తులో 18 ఏళ్లని రాసి ఉంది" ఆశ్చర్యపోయాడు కొత్తగా వచ్చిన జడ్జి.

"అందులో అబద్ధం ఏం లేదండి. నా కేసు కోర్టుకు వచ్చినపుడు నా వయస్సు పద్దెనిమిదేళ్లే నండి" చేతులు కట్టుకుని విన్నవించుకున్నాడు నిందితుడు.

## అందుకే అభిమానం

"మీ అభిమాన రచయిత ఎవరు?"

"జార్జ్ వాషింగ్టన్"

"ఆయన రచనలు చేయలేదే!"

"అందుకే ఆయనంటే అభిమానం"

## తెలివి

"ఒరేయ్ ... ఆవుకు పచ్చ కళ్లద్దాలు ఎందుకు పెట్టావురా?" అరిచాడు యజమాని.

"ఆయ్ .. ఈరోజు పచ్చగడ్డి దొరకలేదండి" చెప్పాడు పాలేరు.

# వేటాడే నీడలు

ఈ వారం కథ

▪ కె.ఎల్. సూర్య

**ఒక్కసారిగా మెలకువ వచ్చింది. ఆ మెలకువతో పాటు ఒళ్లంతా భగ్గుమంటున్న అనుభూతి కూడా స్పృహలోకి వచ్చింది. తను ఉలగచుట్టుకుని ఉన్నాడు. చీకటిలో ఉన్నాడు. తను ఉన్న చోటు మాత్రం కదులుతూ ఉంది. ఇంతకీ తనకేమైంది? ఒళ్లంతా పచ్చి పుండులా ఉంది. ఎక్కడ ఏమైందో కూడా అర్థం కావడం లేదు. కానీ కడుపు నుంచి చేయి మీదకి ఏదో జిగటగా కారుతున్న స్పర్శ మాత్రం తెలుస్తోంది.**

ఆ .... ఇప్పుడు గుర్తుకువచ్చింది! తను ఆఫీసు నుంచి ఇంటికి నడుచుకుంటూ వెళ్తున్నాడు. ఎప్పటిలాగే అదే దారిలో వెళ్తున్నాడు. కానీ ఆ స్కూలు కాంపౌండు దగ్గరకి వచ్చేసరికి, వెనక నుంచి ఎవరో ఒక్క తోపు తోశారు. తల ఎత్తి చూసేలోగా ఒక గోనెసంచి తలని కప్పేసింది. రెండు బలమైన చేతులు మెడని చుట్టుకున్నాయి. మరో చేయి కడుపులో ఒక్క పోటు పొడిచింది. మరిగే ఇనుముని రక్తంలో కలిపేసినట్లు ... ఒళ్లంతా కారపు మంట. ఆ తరువాత ఏమైందో తెలియదు. బహుశా తనని కారు డిక్కీలో పడేసి ఎక్కడికో తీసుకుపోతూ ఉండి ఉంటారు.

ఒకసారి పొట్ట దగ్గర తడిమి చూసుకున్నాడు. పొత్తికడుపుకి కుడివైపున ముట్టుకుంటే చాలు మండిపోతోంది. అక్కడే పొడిచి ఉంటారు. ఒక పక్క ఒళ్లంతా తీపులుగా ఉన్నా, తనేమిటన్న స్పృహ మాత్రం వస్తోంది. తన ప్రాణం తీయాలనుకునేంత శత్రుత్వం ఎవరికి ఉంది? తన కోసం వచ్చిన ఆ ఇద్దరూ ఎవరై ఉంటారు? ఈ కారు ఎవరిదై ఉంటుంది?

మనసు పరిపరి విధాలా పోతోంది. కారుని తట్టి చూశాడు. చాలా గట్టిగా ఉంది. పెచ్చులూడిన తుప్పు రజను గరుకుగా చేతికి తగులుతోంది. ఒకటే చమురు కంపు. తనకి కార్ల గురించి పెద్దగా అవగాహన లేదు. అయినా అదేదో పాత అంబాసిడర్ కారు అయి ఉంటుందన్న భావన మాత్రం కలిగింది. తను పాత సినిమాల్లో ఇలాంటి దృశ్యాలు చాలానే చూశాడు.

కారు ఒక్కసారిగా ఏదో గోతిలోంచి వెళ్లింది. ఆ కుదుపుకి ప్రాణం పోయినంత పనయ్యింది. అరుద్దామనుకుంటే, ఓ చిన్న మూలుగు మాత్రమే బయటకి వచ్చింది. తనని ఇంత క్రూరంగా పొడిచేంత కసి ఎవరికి ఉండి ఉంటుంది? తనెంత సాధారణ మధ్యతరగతి మనిషో కదా! ఆ ఆలోచన రాగానే తన భార్యాపిల్లలు గుర్తుకువచ్చారు. బంగారంలాంటి భార్య, ఇప్పుడిప్పుడే ఒక్కో మాటా చెబుతున్న రెండేళ్ల కొడుకు. ఈపాటికి వాళ్లిద్దరూ తనకోసం ఎదురుచూస్తూ ఉంటారు. ఇంకాసేపు గడిస్తే భార్య కంగారుపడి పోలీస్ కంప్లైంట్ కూడా ఇస్తుందేమో! ఇంత జరిగాక వాళ్లని తిరిగి కలవడం కష్టమే! ఒక్కసారిగా కొడుకు మొహం గుర్తుకువచ్చి కళ్ల వెంబడి నీళ్లు వచ్చాయి. పొద్దున్న వాడు ప్లే స్కూల్‌కి వెళ్లనని మారాం చేస్తే తిట్టిన తిట్లూ గుర్తుకువచ్చాయి.

కడుపులోంచి ఒకటే మంట. ప్రాణం పోతే బాగుండు అన్నంత నొప్పి. తన శరీరానికి జరిగిన నష్టం ఎంతో తెలిసే అవకాశం లేదు. తను ఎన్నిసార్లు ఇంటర్నెట్లో చూసినా కడుపులో కాలేయం ఎక్కడ ఉంటుందో, కిడ్నీలు ఎక్కడ ఉంటాయో గుర్తుండవు. కానీ వాటిలో ఏదో ఒకదానిలోకి కత్తి దిగే ఉంటుంది. బతికి బట్టకట్టినా ఆపరేషన్ తప్పదు. ఒకవేళ అప్పటికప్పుడు కిడ్నీ




బొమ్మలు : **చారి పి.యస్.**

కావాలంటే తనకోసం ఎవరన్నా ఇస్తారా... ఈ ఆలోచనకి విరక్తిగా ఓ నవ్వు వచ్చింది.



ఇంతకూ తనని పొడిచింది ఎవరై ఉంటారు?!

'నా పిల్లలు బంగారం. వాళ్లెప్పుడూ తప్పు చేయరు' అని తన తల్లి పదిమందికీ చెబుతూ ఉండేది. ఆ మాటలకి అంగీకారంగా తండ్రి కూడా ముసిముసినవ్వులు నవ్వేవాడు. ఆస్తి కోసం పోట్లాడినా, బీరువా బద్దలుకొట్టి ఇంటి కాగితాలు చేజిక్కించుకున్నా, తాగేసి ఇంటికివెళ్లినా... వాళ్లు అదే మాట పదేపదే చెప్పేవారు. అలాంటిది తనని ....

ఎందుకో హఠాత్తుగా ఫణి గుర్తుకువచ్చాడు. ఫణిది తన ఆఫీసే! తన పక్క సీటే. మొదట్లో తామిద్దరూ చాలా స్నేహంగా ఉండేవారు. ఎవరికి ఏ అవసరం వచ్చినా ఆదుకునేందుకు మరొకరు సిద్ధంగా ఉండేవారు. ఇద్దరి కుటుంబాలూ ఒకటిగా మెసిలేవి. కానీ ఎందుకనో నిదానంగా విభేదాలు మొదలయ్యాయి. ఒకరి వెనుక మరొకరి మాటలు ఎక్కువయ్యాయి. ఆఫీసు పనిలో ఎవరి తప్పు బయటపడుతుందా అన్న వెతుకులాటలోకి దిగారు.

అలాంటి సమయంలో ఓ బంగారంలాంటి అవకాశం తన చేతికి వచ్చింది. ఏదో సబ్ కాంట్రాక్టు విషయంలో ఫణి తప్పటడుగు వేశాడు. అది కావాలని చేసిన తప్పో, తెలియక చేసిన పొరపాటో చెప్పడం కష్టం. నిజానికి దానిని వెంటనే సవరించే అవకాశం కూడా ఉంది. కానీ తను అంతగా ఆలోచించలేదు. ఒక సుదీర్ఘమైన రిపోర్టు తయారుచేసి పై అధికారులకు పంపాడు. తను చేసిన పని వల్ల సంస్థకి చాలా ఉపయోగం అని మనసుకి సర్దిచెప్పుకున్నాడు. ఫలితం! ఫణి ఉద్యోగం ఊడింది. తనకి ఇష్టం లేని మనిషి ఉద్యోగాన్ని ఊడగొట్టానని సంబరపడ్డాడే కానీ, అతని జీవితం ఏమైపోతుందా అని ఆలోచించలేదు. తరువాత కాలంలో ఫణిని ఒక్క క్షణం కూడా తల్చుకోలేదు. కానీ ఫణి వాళ్ల కుటుంబం చాలా ఇబ్బందుల్లో ఉందని ఈమధ్యనే తెలిసింది. ఒక వారం క్రితం అతను రైతు బజారులో కనిపించాడు. ఒకరినొకరు చూసీచూడనట్లు తప్పుకున్నారే కానీ అతని కళ్లలో కసిని మాత్రం గమనించకపోలేదు.

బహుశా ఫణియే తనని చంపించేందుకు ప్రయత్నించాడా? తను చేసిన పనితో ఫణి కుటుంబం వీధిన పడి ఉంటే, తనని చంపాలన్నంత కసి కలగడంలో ఆశ్చర్యం లేదుగా! కానీ ఫణికి దేవుడంటే విపరీతమైన భక్తి, దయ్యాలంటే విపరీతమైన భయం. కాబట్టి హత్య చేసేందుకు అతను సాహసించకపోవచ్చు. మరి తనంటే అంత ఉడుకుమోతు తనం ఎవరికుంది. తన జీవితంలో ఎన్నడూ, ఎవరితోనూ వీధిలో పడి గొడవపడలేదు. చొక్కాలు చింపుకుంటూ కొట్టుకోలేదు. 'చంపుతాను, నరుకుతాను' అంటూ శపథాలు చేసుకోలేదు ... కానీ గొడవపడకుండానే సాగించిన యుద్ధాలు చాలానే గుర్తుకువచ్చాయి. పల్లెత్తు మాట అనకుండానే సాగించిన పగలు స్ఫురించాయి. ఎవరో దాకా ఎందుకు, తన బాబాయి కొడుకు సుమంత్‌తో ఎంత రచ్చ నడిచిందని!

సుమంత్ పేరెత్తితే చాలు 'ఛీ వాడా త్రాష్టుడు' అంటారు తన ఇంట్లోవారు. సుమంత్ త్రాష్టుడే! ఎందుకంటే వాడికీ, తనకీ మధ్య ఆస్తి గొడవలున్నాయి కాబట్టి! వాడికీ తనకీ కలిపి మూడు వందల గజాల స్థలం ఉంది. అది చెరిసగం పంచుకోమన్న పెద్దల వీలునామా కూడా ఉంది. కానీ ఎలా తెగ్గొట్టుకోవాలన్న సూచన మాత్రం లేదు. అసలే అడ్డదిడ్డంగా ఉన్న ఆ స్థలంలో పాత ఇల్లొకటి. దాంతో ఆ ఇంటినీ, స్థలాన్నీ పంచుకునేందుకు నిరంతరం పంచాయితీలే!

ఎలాగో ఒకలా ఆ స్థలాన్ని విడగొట్టుకున్న తరువాత, తన వాటాని అమ్ముకునేందుకు ఆర్నెళ్లు కూడా ఆగలేదు. పూర్వీకుల స్థలం రాత్రికి రాత్రే అమ్ముడు పోయిందన్న విషయం తెలిసి సుమంత్ ఒంటికాలి మీద లేచాడు.



ఎందుకో హఠాత్తుగా ఫణి గుర్తుకువచ్చాడు. ఫణిది తన ఆఫీసే! తన పక్క సీటే. మొదట్లో తామిద్దరూ చాలా స్నేహంగా ఉండేవారు. ఎవరికి ఏ అవసరం వచ్చినా ఆదుకునేందుకు మరొకరు సిద్ధంగా ఉండేవారు. ఇద్దరి కుటుంబాలూ ఒకటిగా మెసిలేవి. కానీ ఎందుకనో నిదానంగా విభేదాలు మొదలయ్యాయి. ఒకరి వెనుక మరొకరి మాటలు ఎక్కువయ్యాయి. ఆఫీసు పనిలో ఎవరి తప్పు బయటపడుతుందా అన్న వెతుకులాటలోకి దిగారు.

రిజిస్టర్ ఆఫీసుకి వచ్చి నానా యాగీ చేశాడు. ఊళ్లో పరువు తీశావంటూ తెగ రగిలాడు. అప్పటి నుంచి సుమంత్‌కీ తనకీ మాటల్లేవు. కానీ తన మీద వాడికి ద్వేషం ఏ మేరకుందో గ్రహించలేకపోలేదు. ఆ ద్వేషంతోనే సుమంత్ ఈ పని చేసి ఉండడు కదా ... అకస్మాత్తుగా వెన్నులోంచి వణుకు మొదలైంది. తన తమ్ముడే తనని చంపాలనుకున్నాడన్న అనుమానమో, ఒంట్లోంచి జారుకుంటున్న సత్తువే కారణమో ... వెన్నులోంచి ఒకటే చలి.



కారు ఒక్క కుదుపుతో ఆగింది.

ఎందుకు ఆగినట్టు? తనని వదిలించుకునే గమ్యం వచ్చేసిందా! అప్పటిదాకా వణికిన శరీరం కాస్తా వేడెక్కిపోయింది. 'దేవుడా! కారు మళ్లీ కదిలితే బాగుండు' అనిపించింది. కారు కదులుతున్నంతసేపూ తను సురక్షితం. అది ఆగిందా ... తన పని గోవిందా! కారు ఆగడంతో బాధతో ఒగరుస్తున్న తన ఊపిరి తనకే భయం గొలిపేంత స్పష్టంగా వినిపిస్తోంది. దాంతోపాటే ఏవో మాటలు వినిపించసాగాయి. వాటికి తోడుగా సిగరెట్ వాసన గుప్పుమని వచ్చింది. సిగరెట్ తాగుతూ రిలాక్స్ అవడం కోసం ఆగినట్లున్నారు.

"పోయుంటాడా?"

"బానే పొడిచావుగా ... పోకేమవుతాడు. కాస్తో కూస్తో ప్రాణం ఉంటే ఈపాటికి గోతుల్లోకి జారిపోయి ఉంటుంది."

"మరింకేం!"

"బాడీని వదిలించుకోవద్దా? చాటుమాటున ఒక్క పోటు పొడవడానికి నీకు లక్ష రూపాయలు ఎందుకిస్తాను? ఇంతకీ బాడీని ఎక్కడ పడేద్దాం ..."

"అంత తొందరెందుకు? ఇంకా ఓ వంద కిలోమీటర్ల పైనే వెళ్లాలి. పైగా ఓ కొండ ఎక్కి దిగాలి. ఆకలేస్తే వెనక సీట్లో బిర్యానీ పొట్లం ఉంది. తీసుకుని తిను."

తనని చంపేసి బిర్యానీ తినేంతటి ప్రశాంతత అన్నమాట!

సిగరెట్ తాగడం పూర్తయినట్లుంది. కారు బయల్దేరింది. మళ్లీ ఆలోచనలు మొదలయ్యాయి. తనలాంటి సామాన్యుడిని చంపడానికి లక్ష రూపాయల సుపారీనా! కారు ఓ కొండ ఎక్కిదిగాలా? ఈ సంఘటనకు ముందు తను ఏనాడూ ఇంత దూరం కారులో ప్రయాణించింది లేదు. కారు ఎటు పోతోంది అనేదానికన్నా తనని అంత కసిగా వదిలించుకునే ప్రయత్నం ఎవరు చేస్తున్నారన్న ఆలోచనే తొలిచేస్తోంది.

అంతగా కక్ష కట్టారంటే ఎవరో తన వల్ల బాగా నష్టపోయి ఉంటారు. నెమ్మదస్తుడనే పేరు, కష్టపడతాడనే గుర్తింపు, సంస్కారవంతుడనే అభిప్రాయం, చూడగానే పలకరించే జనం, ఇంటినిండా పుస్తకాలు, పేరు పక్కనే డిగ్రీలు ... అరే! ఇన్ని ఉన్న తనని చంపాలని ఎవరికనిపించింది. ఎవరికి? ఎవరికి?!

బుర్ర మరింత వేగంగా ఆలోచించసాగింది.

చటుక్కున బావ మెదిలాడు. బావ గుర్తుకు రావడంతో ఇందాక విన్న ఓ గొంతుక తన బావ స్వరానికి దగ్గరగా తోచింది. వాడిని తన అక్క పట్టుబట్టి మరీ పెళ్లి చేసుకుంది. ఎందుకనో వాడిని చూసిన మరుక్షణంలోనే ఉత్త పనికిమాలిన వెధవనిపించాడు. ఎంత నెమ్మదిగా మాట్లాడినా జిత్తులమారి నక్కలాగే తోచేవాడు. పట్టుమని ఏడాదైనా స్థిరంగా ఏ ఉద్యోగంలోనూ ఉండేవాడు కాదు. ఠంచనుగా పిల్లల్ని మాత్రం కనిపారేశాడు. దాంతో అక్క కుటుంబం తన ఇంట్లోనే ఉండేది.

అక్క చేతుల మీదుగా బావకి సాగుతున్న జరుగుబాటుని చూసి ఒళ్లు మండిపోయేది. రోజూ కొత్తల్లుడిలా తిరుగుతుండే వాడిని చూసి కడుపు రగిలిపోయేది. ఎప్పుడెప్పుడు



వాడిని తరిమికొడదామా అని తెగ ఉబలాటపడేవాడు. తల్లిదండ్రుల్ని ఎంతగా రెచ్చగొట్టినా ఉపయోగం లేకపోవడంతో ... చివరికి బావ కావాలో తను కావాలో తేల్చుకోమంటూ అల్టిమేటం జారీ చేశాడు. ఆ ఆజ్ఞకు తండ్రి తలవంచక తప్పలేదు. మొహమాటం వదిలి అల్లుడిని తన దారి తనను చూసుకోమని చెప్పకా తప్పలేదు. మామా అల్లుళ్ల మధ్య సంభాషణ జరుగుతున్నంతసేపూ ఏమీ ఎరగనట్లు గదిలోనే కూర్చున్నాడు తను. మధ్యలో తన గురించి ప్రస్తావన ఎక్కడ వస్తుందో అని గుండె అల్లల్లాడుతూనే ఉంది. అదృష్టవశాత్తూ అలాంటి ప్రస్తావనలేమీ లేకుండానే వాదనలు ముగిశాయి. బావకి పౌరుషం ముంచుకొచ్చి మర్నాడే ఇల్లు మారిపోయాడు. అతనితో ఎవరూ చెప్పకుండానే ఈ పరిస్థితికి కారణం తనే అని తెలిసే ఉంటుంది. అందుకే వెళ్లేటప్పుడు తన వంక కొరకొరా చూస్తూ బుసలు కొట్టుకుంటూ బయలుదేరాడు.

•••

కారు కొండ ఎక్కుతున్నట్లుంది. ఆ ఏటవాలు ప్రయాణంలో ఒక్క ఉదుటున తను డిక్కీ డోరుకు తగిలాడు. ఇనుప రేకులు నొక్కుకుని ప్రాణం విలవిల్లాడిపోయింది. కారుని కొండ ఎక్కించే ప్రయత్నంలో డ్రైవరు గేర్లు మార్చి మార్చి తోలుతున్నాడు. కారు కుదుపులకి శరీరం ఎగిరెగిరి పడుతోంది.

ఇంతలో హఠాత్తుగా....

డిక్కీ తలుపు కీచుమంటూ ఎగిరిపడింది. అటూఇటూ ఊగుతున్న ప్రాణం ఒక్కసారిగా తిరిగి మెదడుని మేల్కొల్పినట్లయ్యింది. అంత చిమ్మచీకటిలోనూ, తెరుచుకున్న డిక్కీ సందులోంచి దూసుకొచ్చిన దుమ్ము ముక్కుకు ఘాటుగా తగులుతోంది. కారు చప్పుడుకి దారిపక్కని పొదలన్నీ భయపడి పారిపోతున్నట్లు తోచాయి.

బలమంతా ఉపయోగించి డిక్కీ తలుపుని పైకి తోసి, ఆ సందులోంచి ఒక్క ఉదుటున నేల మీదకి పడ్డాడు. కారులో ఉన్నవారు తనని గమనిస్తారేమో అన్న భయంలో గాయం తాలూకు నొప్పి కూడా తెలియలేదు. కారు ఆగకుండా ముందుకు సాగేకొద్దీ తనలో పట్టలేని ఆనందం. అంత హడావుడిలోనూ తను కారు నెంబరుని గుర్తుంచుకున్నాడు.

•••

"నీకు కల్పన తెలుసా!" వార్డులోకి వస్తూనే అడిగాడు ఇన్‌స్పెక్టర్.

ఇంతకుముందులా అతను తన గాయం మానిందో లేదో కనుక్కోలేదు. నింపాదిగా మంచం పక్కన కూర్చుని సేద తీరలేదు. గదిలోకి అడుగుపెడుతూనే అడిగేశాడు. పైగా మునుపటిలా కాకుండా ఏకవచనంలో! కల్పన పేరు వినగానే ఒక్కసారిగా తన ఉనికి నిలిచిపోయినట్లనిపించింది. అంత దిగ్భ్రాంతిలోనూ తన భార్య వంక బెరుగ్గా చూశాడు. ఆమె మొహంలో తనకి ఎలాంటి భావమూ స్ఫురించలేదు.

"కల్పన ఎవరో తెలుసా!" రెట్టించాడు ఇన్‌స్పెక్టరు.

"ఊ ..." ఇబ్బందిగా బదులిచ్చాడు తను.

ఉద్యోగంలో చేరిన వెంటనే ఇంట్లోవారు తనకు పెళ్లి సంబంధాలు చూడటం మొదలుపెట్టారు. ఆ సమయంలోనే కల్పన సంబంధం వచ్చింది. బంగారుఛాయ, కళగల మొహం, తనతో సమానమైన చదువు ... చూడగానే కళ్లకి అద్దుకుని చేసుకోవచ్చు అనిపించింది. దాంతో పెళ్లి చర్చలు ముందుకు సాగాయి. వారం తిరక్కుండానే నిశ్చితార్థం కూడా పూర్తయిపోయింది. పెళ్లికి సిద్ధపడే సమయంలో లాంఛనాల దగ్గర గొడవలు మొదలయ్యాయి.

దాదాపు ఏడేళ్ల క్రితం సంగతి ...

ఉద్యోగంలో చేరిన వెంటనే ఇంట్లోవారు తనకు పెళ్లి సంబంధాలు చూడటం మొదలుపెట్టారు. ఆ సమయంలోనే కల్పన సంబంధం వచ్చింది. బంగారుఛాయ, కళగల మొహం, తనతో సమానమైన చదువు ... చూడగానే కళ్లకి అద్దుకుని చేసుకోవచ్చు అనిపించింది. దాంతో పెళ్లి చర్చలు ముందుకు సాగాయి. వారం తిరక్కుండానే నిశ్చితార్థం కూడా పూర్తయిపోయింది. పెళ్లికి సిద్ధపడే సమయంలో లాంఛనాల దగ్గర గొడవలు మొదలయ్యాయి. పెద్దలు మాటామాటా అనుకున్నారు. డబ్బు దగ్గర వెనక్కి తగ్గడం ఎందుకని తనూ మిన్నకుండిపోయాడు. అలా ఆ పెళ్లి సందడి సద్దుమణిగిపోయింది. సంబంధాన్ని ఎలాగైనా నిలబెట్టుకుందామంటూ కల్పన తనకి చేసిన ఆఖరి ఫోన్ చాలా రోజులు వెంటాడింది. ఆ తరువాత కల్పన ఏమైందో తెలుసుకునే ధైర్యం తనకి లేకపోయింది. సగటు మనిషిలో ఉండే బలహీనతలకు తనేమాత్రం అతీతుడు కాదు. లేకపోతే తుచ్ఛమైన లాంఛనాల కోసం కల్పనను వదులుకుంటాడా?

"కల్పన వాళ్లన్నయ్యే నీ మీద హత్యా ప్రయత్నం చేశాడు. పెళ్లి దాకా వచ్చిన సంబంధాన్ని నీవు కాదన్నావంట కదా! దాంతో అతని చెల్లెలి జీవితం పాడైపోయిందట. ఆ కక్షతోనే నిన్ను చంపాలనుకున్నాడు. ప్రస్తుతం అతను రిమాండ్లో ఉన్నాడు. నేరం ఒప్పుకున్నాడు కాబట్టి తీర్పు అంత కష్టం కాకపోవచ్చు. అయినా నువ్వు ఒకటి రెండుసార్లు కోర్టుకి రావాల్సి ఉంటుంది" విషయం చెప్పి వెళ్లిపోయాడు ఇన్‌స్పెక్టర్.

ఇన్‌స్పెక్టర్ వెళ్లిపోయిన తరువాత తన భార్యవంక చూడాలనిపించలేదు. తనవల్ల కల్పన జీవితం పాడైపోయిందా! ఏమై ఉంటుంది? పెళ్లి కాకుండా ఉండిపోయిందా? డిప్రెషన్ తట్టుకోలేక ఆత్మహత్య చేసుకుందా? ఏమో ... ఏమైనా జరిగి ఉండవచ్చు. ఆరోజు తను తీసుకున్న నిర్ణయం ఈ పరిణామానికి దారితీసిందన్నమాట. తన జీవితంలో అలాంటి నిర్ణయాలు ఇంకా ఎన్ని ఉన్నాయో! అవి ఎవరెవరి జీవితాలను మార్చేశాయో! వాళ్లు తన మీద ఎంత పగతో రగిలిపోతున్నారో!

"అయ్యయ్యో! చీమకి కూడా అపకారం తలపెట్టడు నా బిడ్డ. కనీసం గొంతు పెంచి ఎప్పుడూ గొడవకి కూడా వెళ్లలేదు. అలాంటి నా బిడ్డ మీద అఘాయిత్యం చేయడానికి ఎవడికి చేతులొచ్చాయో ..." పెద్దగా ఏడుస్తూ తన తల్లి హస్పిటల్ వార్డులోకి రావడం లీలగా వినిపిస్తోంది. మందులకో ఏమో ... మనసు మత్తులోకి జారుకుంటోంది. ఆ మత్తులో ఫణి, సుమంత్, బావ, కల్పన ... ఒక్కొక్కరుగా కళ్ల ముందు మెదలసాగారు. వాళ్ల వెనకాల అస్పష్టంగా మరెన్నో రూపాలు కదలాడుతున్నాయి.

రచయిత సెల్ : **93934 72410**



# వర్జిన్ సాంగ్రియా

ఫుడ్ కోర్ట్

**కావలసిన పదార్థాలు:**

నల్ల ద్రాక్ష- మూడు కప్పులు, దానిమ్మ గింజలు- ఒక కప్పు, బత్తాయి రసం- ఒక కప్పు, నిమ్మరసం- ఒక టేబుల్ స్పూను, చక్కెర- రెండు టేబుల్ స్పూన్లు, యాపిల్- ఒకటి, నిమ్మకాయ- ఒకటి, తాగే సోడా- 200 ఎం.ఎల్.

**తయారీ విధానం:**

నల్ల ద్రాక్ష, దానిమ్మ గింజలను మిక్సీలో వేసి జ్యూస్ చేసుకోవాలి. తర్వాత బత్తాయి రసం, నిమ్మరసం, చక్కెర వేసి బాగా కలపాలి. సర్వ్ చేసే ముందు కొన్ని నిమ్మకాయ, యాపిల్ ముక్కల్ని వేసుకోవడంతో పాటు తాగే సోడాను కూడా కలపాలి.



# చల్ల చల్లని.. కూల్ కూల్..

## జిగర్‌తండా

**కావలసిన పదార్థాలు:**

బాదంచెట్టు జిగురు- ఒక టీ స్పూను (మార్కెట్లో దొరుకుతుంది), పాలు- ఒక కప్పు, ఐస్‌క్రీమ్- రెండు టేబుల్ స్పూన్లు, చక్కెర- మూడు టేబుల్ స్పూన్లు, రోజ్ వాటర్- మూడు టేబుల్ స్పూన్లు.

**తయారీ విధానం:**

బాదం జిగురును నీటిలో వేసి రాత్రంతా నానబెట్టాలి. తర్వాత చక్కెర వేసి పాలను వేడిచేసి చల్లారనివ్వాలి. ఆ తర్వాత రోజ్‌వాటర్, బాదం జిగురు వేసి బాగా కలిపి, గ్లాసులో పోసి పైన ఐస్‌క్రీమ్ పెట్టి సర్వ్ చేయాలి.



## తండాయ్

**కావలసిన పదార్థాలు:**

బాదం- ఒక కప్పు, పిస్తా- ఒక కప్పు, పాలు- 3 కప్పులు, యాలకుల పొడి- ఒక టీ స్పూను, రోజ్ వాటర్- 2 టీ స్పూన్లు, కుంకుమ పువ్వు- కొద్దిగా, ఐస్ ముక్కలు- తగినన్ని, చక్కెర- తగినంత.

**తయారీ విధానం:**

బాదం, పిస్తాలను కలిపి కొన్ని పాలు పోసి మెత్తగా రుబ్బుకోవాలి. తర్వాత ఐస్ ముక్కలు, మిగిలిన పదార్థాలన్నిటినీ వేసి బాగా కలుపుకోవాలి. పైన కుంకుమ పువ్వు, బాదం ముక్కలు, పిస్తా తురుము జల్లి తాగితే చల్లగా చాలా బాగుంటుంది.



## కొబ్బరి పైనాపిల్ జ్యూస్

**కావలసిన పదార్థాలు:**

కొబ్బరి నీళ్లు- 2 కప్పులు, పైనాపిల్ ముక్కలు- రెండు కప్పులు, కొబ్బరి తురుము- అర కప్పు, నిమ్మరసం- ఒకటిన్నర టేబుల్ స్పూను, తేనె- ఒక టేబుల్ స్పూను.

**తయారీ విధానం:**

కొబ్బరి నీళ్లతో పైనాపిల్ ముక్కలను, కొబ్బరి తురుమును మెత్తగా రుబ్బుకుని వడపోసుకోవాలి. తర్వాత నిమ్మరసం, తేనె వేసి కలుపుకోవాలి అంతే.. ఇది చాలా తేలికగా చేసేయొచ్చు.






## రాక్షసబల్లి గుడ్లు

న్యూజిలాండ్‌లోని కొయ్‌కో తీర ప్రాంతాన్ని చూస్తే అక్కడ డైనోసార్ల గుడ్లు కుప్పలుతెప్పలుగా కనిపిస్తాయి. మనం పొరపాటున జురాసిక్ పార్కులోకి రాలేదు కదా అనిపిస్తుంది. అవి గుడ్లు కాదు... రాళ్లు అని ఎవరైనా చెప్పినా నమ్మబుద్ధి కాదు. అవి రాళ్లే గానీ యాభై లక్షల సంవత్సరాల క్రితం కర్బన పదార్థాలతో ఏర్పడిన రాళ్లట. ఆ రాళ్లల్లో మెగ్నీషియం, ఐరన్, ఆక్సిజన్‌లు కూడా సమస్థాయిల్లో ఉండటం, కాలక్రమంలో అలలు తీసుకువచ్చిన మట్టి... పొరలు పొరలుగా 50 మీటర్ల మందాన వాటి చుట్టూ పేరుకోవడంతో అవి గుండ్రటి రూపాన్ని సంతరించుకున్నాయి. వాటి నిర్మాణం రీత్యా అవి క్షయాన్ని సమర్థంగా ఎదుర్కోవడమే కాక ఒక్కోసారి 12 అడుగుల వ్యాసంతో భారీ ఆకారాల్ని సంతరించుకుంటున్నాయి.



## ఈ కాకి తెలివి అమోఘం

జీవులు ఎంత తెలివైనవో తెలుసుకునే ప్రయత్నాల్లో భాగంగా జీవ శాస్త్రవేత్తలు చేసే పరీక్షల్లో ఒకటి మిర్రర్ టెస్ట్. అంటే అద్దంలో తనను తాను చూసుకున్నప్పుడు గుర్తు పట్టగలగడం. ఆ పరీక్షలో విజయం సాధించిన మొదటి పక్షి యురేషియన్ మాగ్‌పై (Magpie). కాకి జాతికి చెందిన మాగ్‌పై ఈకలు నలుపు తెలుపు రంగుల్లో ఉంటాయి. ఐరోపా, ఆసియా ఖండాల్లోని కొన్ని దేశాలతో పాటు మాగ్‌పై మన దేశంలోని జమ్ము అండ్ కశ్మీర్ రాష్ట్రంలో కూడా కనిపిస్తుంది. శత్రువు నుంచి రక్షణ కోసం మాగ్‌పై తన గూటిని ముళ్లున్న కొమ్మలతో కట్టుకుంటుంది. అయినా శత్రువు వస్తే పారిపోవడానికి గూడుకు రెండో వైపున రహస్య మార్గాన్ని కూడా నిర్మించుకుంటుంది.

## చుక్కలు కలపండి



## మీకు తెలుసా!

- ఎవరెస్ట్‌ని అధిరోహించిన మొదటి తండ్రీకొడుకులు - ఎడ్మండ్ హిల్లరీ (1953), పీటర్ హిల్లరీ (1990)
- ఈగల జీవిత కాలం 25 నుంచి 30 రోజులు.
- ప్రపంచంలోనే అత్యధిక సంఖ్యలో మ్యూజియమ్స్ ఉన్న దేశం ఇజ్రాయెల్.
- మానవులు ఆహారం కోసం సుమారు 2 వేల రకాల జాతుల మొక్కలను పెంచుతున్నారు.
- యాంటిబయోటిక్స్ కేవలం బ్యాక్టీరియాలపైనే పోరాడతాయి, వైరస్‌ల మీద కాదు.
- ప్రపంచానికి అవసరమైన ఆట వస్తువుల్లో 70 శాతం చైనానే ఉత్పత్తి చేస్తుంది.





## ది బాస్ బేబీ

పిల్లలనే కాదు పెద్దలనూ ఆకట్టుకుంటుంది మా సినిమా అని ధీమాగా చెబుతున్నారు డ్రీమ్‌వర్క్స్ యానిమేషన్ సంస్థ వారు. ఈ వేసవిలోనే విడుదల కానున్న 'ది బాస్ బేబీ' గురించి వాళ్లకంత నమ్మకం ఉంది. 2010లో మార్ల్ ఫ్రేజీ రాసిన 'ది బాస్ బేబీ' పుస్తకాన్ని వాళ్లు అదే పేరుతో త్రీడీ యానిమేటెడ్ మూవీగా ముస్తాబు చేస్తున్నారు. ఓ టీనేజర్‌కు కొత్తగా తమ్ముడు పుడతాడు. వాడు పుట్టుకతోనే మాట్లాడతాడు. అంతేకాదు... రహస్యంగా 'పప్పీ అండ్ కో'లో బాస్‌గా ఉద్యోగం కూడా చేస్తుంటాడు. ఆ టాలెంట్స్ సంగతి ఎలా ఉన్నా తమ్ముడి రాక వల్ల పేరెంట్స్ దగ్గర ప్రేమను కోల్పోయిన టీనేజర్ ఏం చేస్తాడు? అనే ఆసక్తికర కథనంతో సాగుతుంది సినిమా.

## చిన్న పట్నం పెద్ద ప్రయత్నం

అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో ఒకటైన ఓహియోకు పశ్చిమ తీరంలో ఉంది కాసె ఇలినాయ్. ఏ ప్రత్యేకతా లేని ఓ చిన్న పట్నం అది. అయినా తమ ఊరు ఎలాగైనా ప్రపంచం దృష్టిని ఆకర్షించాలి అనుకున్నారా పట్టణవాసులు. ఆలోచన వచ్చిందే తడవుగా మామూలు వస్తువులన్నిటినీ భారీ రూపంలోకి మార్చేశారు. అలా వారు తయారు చేయించిన వాటిలో పెన్సిల్, గాలి గంట, గోల్ఫ్ ట్రీ, అల్లిక సూదులు, చెక్క బూట్లు, కుర్చీ, పోస్ట్‌బాక్స్ వగైరాలు ఉన్నాయి. అందులో గోల్ఫ్ ట్రీ (30 అడుగుల ఎత్తు, 3020 కేజీల బరువు), గాలి గంట (స్టాండ్ 56 అడుగుల ఎత్తు, పైప్ 42 అడుగుల ఎత్తు), అల్లిక సూదులు (13 అడుగులు) గిన్నిస్ బుక్‌లోకి ఎక్కి ప్రపంచాన్ని ఆకర్షిస్తున్నాయి.



## నా బొమ్మ



**ఎం. ఆకాష్,**
LKG,
శ్రీ భావన విద్యానికేతన్,
విశాఖపట్టణం




## రంగులు వేయండి



## బుజ్జికి





# అనుగ్రహం

**12-18 మార్చి 2017**

డాక్టర్ పి.ఎ. రామన్



### మేషం
**అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

లక్ష్యసాధనకు ఓర్పు ముఖ్యం. అవకాశాలను తక్షణం వినియోగించుకోండి. సమర్థతకు ఏమంత గుర్తింపు ఉండదు. ఖర్చులు అధికం. పనులు నిదానంగా పూర్తి కాగలవు. ఆహ్వానం అందుకుంటారు. మంగళ, శని వారాల్లో ఒక సంఘటన ఆందోళన కలిగిస్తుంది. ముఖ్యులను కలుసుకుంటారు. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. తొందరపాటు నిర్ణయం తగదు.



### వృషభం
**కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

ఆదాయానికి తగ్గ ఖర్చులుంటాయి. వేడుకలు, శుభ కార్యాలకు హాజరవుతారు. భవిష్యత్ ప్రణాళికలు రూపొందించుకుంటారు. ఆలోచనలు కార్యరూపం దాల్చుతాయి. పనులు సకాలంలో పూర్తి కాగలవు. గురు, శుక్ర వారాల్లో బాధ్యతలు అప్పగించవద్దు. నమ్మకస్తులే మోసగించేందుకు యత్నిస్తారు. వ్యవహారాలు మీ చేతుల మీదుగా సాగుతాయి.



### మిథునం
**మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

శుభకార్యాలని ఆర్భాటంగా చేస్తారు. మీ ఉన్నతిపై బంధువులు అపోహపడే ఆస్కారం ఉంది. కుటుంబ, ఆర్థిక విషయాలు గోప్యంగా ఉంచండి. ఖర్చులు ప్రయోజనకరం. రుణ విముక్తులవుతారు. శనివారం నాడు కావలసిన వ్యక్తుల కలయిక సాధ్యం కాదు. లౌక్యంగా పనులు చక్కబెట్టుకోవాలి. ఆప్తులకు ముఖ్య సమాచారం అందిస్తారు. వాహనం నడిపేటపుడు జాగ్రత్త.



### కర్కాటకం
**పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

ఈ వారం ఖర్చులు విపరీతం. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. రావలసిన ధనంలో కొంత మొత్తం అందుతుంది. రుణ విముక్తులవుతారు. శుభకార్యాల్లో ప్రముఖంగా వ్యవహరిస్తారు. మీ మాటతీరు అందరినీ ఆకట్టుకుంటుంది. ఒప్పందాలకు అనుకూలం. పరిచయం లేని వారితో జాగ్రత్త. బ్యాంకు వివరాలు వెల్లడించవద్దు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించండి.



### సింహం
**మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

కొన్ని సమస్యల నుంచి విముక్తి లభిస్తుంది. కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. వ్యూహాత్మకంగా వ్యవహరిస్తారు. ఖర్చులు భారమనిపించవు. పనుల సానుకూలతకు మరింతగా శ్రమించాలి. దంపతుల మధ్య దాపరికం తగదు. ఆరోగ్యం మందగిస్తుంది. పోగొట్టుకున్న పత్రాలు, వస్తువులు పొందుతారు. దళారులను విశ్వసించవద్దు. ప్రియతములతో ఉల్లాసంగా గడుపుతారు.



### కన్య
**ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

వ్యవహారాలు, ఆర్థిక లావాదేవీలతో తీరిక ఉండదు. పెద్ద ఖర్చు తగిలే ఆస్కారం ఉంది. సలహాలు, సహాయం ఆశించవద్దు. మీ సమర్థతపై నమ్మకం పెంచుకోండి. ఆది, సోమ వారాల్లో పనులు మందకొడిగా సాగుతాయి. ఆందోళన కలిగించిన సమస్య సద్దుమణుగుతుంది. ప్రముఖుల కలయిక వల్ల ఏమంత ప్రయోజనం ఉండదు. ప్రస్తుత వ్యాపారాలే శ్రేయస్కరం.



### తుల
**చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

అంతరంగిక విషయాలు గోప్యంగా ఉంచండి. ఆర్థిక లావాదేవీలు, వ్యవహారాలతో హడావుడిగా ఉంటారు. పనుల సానుకూలతకు బాగా శ్రమిస్తారు. బంధువులతో అభిప్రాయభేదాలు తలెత్తుతాయి. మంగళ, బుధ వారాల్లో పంతాలకు పోయి ఇబ్బందులెదుర్కుంటారు. ముఖ్యమైన పత్రాలు అందుకుంటారు. ఖర్చులు అధికం, ప్రయోజనకరం. రుణ విముక్తులవుతారు.



### వృశ్చికం
**విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

అంచనాలు, ఊహలు ఫలిస్తాయి. భవిష్యత్ పథకాలు రూపొందించుకుంటారు. ఆదాయానికి లోటుండదు. విలాస వస్తువులు కొనుగోలు చేస్తారు. పనులు అస్తవ్యస్తంగా సాగుతాయి. కావలసిన వ్యక్తుల కలయిక సాధ్యం కాదు. గురు, శుక్ర వారాల్లో ఆలోచనలు పలు విధాలుగా ఉంటాయి. శుభ కార్యాల్లో పాల్గొంటారు. బంధువుల ఆదరణ సంతృప్తినిస్తుంది.



### ధనుస్సు
**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

మనోధైర్యంతో వ్యవహరిస్తారు. అవకాశాలు చేజారినా పట్టించుకోరు. ధనం ఆలస్యంగా అందుతుంది. సంతానం కోసం బాగా వ్యయం చేస్తారు. పనులు తేలికగా పూర్తవుతాయి. పెద్దలతో సంప్రదింపులు జరుపుతారు. శనివారం నాడు స్థిమితంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోండి. మీ ప్రమేయంతో శుభకార్యం నిశ్చయమవుతుంది. ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించండి.



### మకరం
**ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

మీదైన రంగంలో రాణిస్తారు. అవకాశాలు కలిసివస్తాయి. వేడుకలను ఘనంగా చేస్తారు. గృహంలో సందడి నెలకొంటుంది. ఆలోచనలు కార్యరూపం దాల్చుతాయి. కొత్త విషయాలు గ్రహిస్తారు. ఆది, సోమ వారాల్లో భేషజాలకు పోవద్దు. చెల్లింపులు, నగదు స్వీకరణలో జాగ్రత్త. పనుల ప్రారంభంలో స్వల్ప ఆటంకాలెదుర్కుంటారు. తొందరపాటుతనం తగదు.



### కుంభం
**ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

ధనలాభం, వస్త్రప్రాప్తి, వాహన యోగం పొందుతారు. అప్రయత్నంగా అవకాశాలు కలిసివస్తాయి. వ్యూహాత్మకంగా వ్యవహరిస్తారు. బంధువులతో సత్సంబంధాలు నెలకొంటాయి. శుభకార్యాల్లో పాల్గొంటారు. దంపతుల మధ్య అవగాహన నెలకొంటుంది. అనుకున్న లక్ష్యాన్ని సాధిస్తారు. మంగళ, బుధవారాల్లో బాధ్యతలు ఇతరులకు అప్పగించవద్దు.



### మీనం
**పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

ఆర్థిక, కుటుంబ సమస్యలు సర్దుకుంటాయి. ఖర్చులు పెరిగినా ధనానికి ఇబ్బంది ఉండదు. పొదుపు పథకాల పట్ల ఆకర్షితులవుతారు. ప్రైవేట్ సంస్థల్లో మదుపు క్షేమం కాదు. పట్టుదలతో అనుకున్న లక్ష్యాన్ని సాధిస్తారు. పనులు సానుకూలమవుతాయి. ఆది, గురు వారాల్లో పరిచయం లేని వారితో జాగ్రత్త. అంతరంగిక విషయాలు వెల్లడించవద్దు.

ఈ వారం కవిత

# ఎగిరే చేప



బొమ్మ : **అక్బర్**

సృష్టిలో ప్రతి జీవకణమూ 'జీవితాన్నిచ్చేదే' అనుకుంటాం
కాని
సృష్టి అణువణువులో 'మరణం' కూడా అజ్ఞాతమ్మై ఉందని తెలియదు
కళ్లు తెరుస్తున్న నిప్పు మొలక జననం
తగలబడ్తున్న అడవి .. అగ్నిచ్ఛటలు .. మరణం

సముద్రంపైకొచ్చిన 'ఎగిరే చేప'
స్వేచ్ఛకోసం జలతలంపై వందల మీటర్లు దూకుతుంది గాలిలో
ఒక్క క్షణం గుండెలనిండా ఊపిరిని పీల్చుకుంటుందో లేదో
ఎక్కడినుండో రివ్వున మృత్యువై వచ్చే రాక్షస గ్రద్ధ
ముక్కుతో కరుచుకుని చేపను తన్నుకుపోతుంది -
అప్పుడప్పుడు తప్పించుకుని జారి
మళ్లీ సముద్రంలోనే పడ్తుంది చేప
లోపలికి నాలుగడుగులు జారుతుందో లేదో
నోరు తెరిచిన తన జాతిదే .. పెద్ద చేప
మృత్యుగహ్వరమ్మై మింగేస్తుంది

జీవి ఏదైనా .. క్షణం క్షణం .. జీవన్మరణ పోరాటమే
బయటా లోపలా
అనవరత అప్రమత్తతతో ... ఒళ్లంతా కళ్లు చేసుకుని మసలాలి
విజయాలూ, గమ్యాలను చేరడాలూ సరే
అసలు బ్రతకడమెలా .. అన్నదే అసలైన నిత్య యుద్ధం -

**- రామా చంద్రమౌళి, 93901 09993**

# ప్లాస్టిక్ రహదారి

ఒకప్పుడు రోడ్డంటే తారు రోడ్డే. బోలెడంత మంది శ్రామికులు, పెద్ద పెద్ద యంత్రాలు కలిసి రోజుల తరబడి రోడ్డును తవ్వి, సమం చేసి, తారు వేసి కొత్తరూపు ఇచ్చేవారు. కొన్నాళ్లకు దృశ్యం మారింది. తారు స్థానంలో సిమెంటు వచ్చింది. మరీ ఎక్కువ శ్రమ పడకుండానే రోడ్లు వేస్తున్నారు. కానీ ఈ రోడ్ల నాణ్యత ఎక్కువ కాలం ఉండటం లేదు.



తారు, సిమెంటు రోడ్ల కంటే చవకగా, వాటి కంటే నాణ్యంగా రోడ్లు వేయగలిగితే అనే ఆలోచనకు జవాబుగా వచ్చింది ప్లాస్టిక్ రోడ్డు. ప్రపంచమంతా ప్లాస్టిక్‌మయం అవుతోన్న సమయంలో ప్లాస్టిక్ వ్యర్థాలతో రోడ్లు వేసే పని ప్రారంభించింది వోకర్‌వేసెల్స్ కంపెనీ. వాడి పారేసిన ప్లాస్టిక్‌ని సేకరించి వాటిని చిన్న చిన్న తునకలుగా యంత్రాలతో కత్తిరించి ఇన్సినరేషన్ ప్లాంట్స్‌లో బూడిదగా మార్చి... మరికొన్ని రసాయనాలను జోడించి ప్రీ ఫ్యాబ్రికేటెడ్ రోడ్ బ్లాక్స్‌ను (ఫ్యాక్టరీలో ముందే తయారు చేసిన రోడ్డు విడిభాగాలు) తయారు చేస్తారు. ఈ బ్లాకులను రోడ్డు నిర్మాణ ప్రదేశానికి తరలించి అమరిస్తే చాలు రోడ్డు తయారైపోతుంది. ఈ రోడ్ల అడుగుభాగం పూర్తిగా ఖాళీగా ఉంటుంది కాబట్టి అక్కడ విద్యుత్ కేబుళ్లను, పైపులైన్లను వేసుకోవచ్చు. భారీ వర్షాలప్పుడు నీరు నిలవకుండా ఈ ఖాళీల్లోకి వెళ్లి అటు నుంచి కాలవల్లోకి వెళ్లిపోయే ఏర్పాటు కూడా ఉంది. ఈ ప్లాస్టిక్ రోడ్ల రూపకర్తలు చెబుతున్న దాని ప్రకారం ప్లాస్టిక్ రోడ్డు నిర్మాణం చవకైనది, తేలికైనది, సులభమ్మైనది, పర్యావరణహితమ్మైనది. ఒకవేళ ఈ రోడ్డు పాడైతే బాగు చేయడం కూడా తేలికే. మన్నిక విషయానికొస్తే ఇది సాధారణ రోడ్డు కంటే రెండు నుంచి మూడు రెట్లు మెరుగైనదట. నెదర్లాండ్‌లో ప్రయోగాత్మకంగా చేపట్టిన ఈ రోడు ఈ ఏడాదిలోనే పూర్తి కానుందట.

# పని చేయించే స్కూళ్లు

పై శీర్షిక చూడగానే ఎవరికైనా అలాంటి పాఠశాలలపై దురభిప్రాయం ఏర్పడుతుంది. కాని... పిల్లలతో పని చేయించినంత మాత్రాన అవేమీ చెడ్డ స్కూళ్లు కావు. ఆ పద్ధతి మంచిది కాకుండానూ పోదు. ఈ విషయాన్ని బలంగా నమ్ముతాయి జపాన్‌లోని కొన్ని స్కూళ్లు.

జపాన్ స్కూళ్లలో పనిమనుషులు ఉండరు. పనిమనుషులే కాదు.. పర్యవేక్షకులు కూడా ఉండరు. వారి పాఠశాల వ్యవస్థ... విద్యార్థులే పాఠశాలను శుభ్రపరుచుకోగలరని, పర్యవేక్షకులు లేకపోయినా తమను తాము నియంత్రణలో ఉంచుకోగలరని విశ్వసిస్తుంది. ఈ విధానం పిల్లలకు సమానత్వాన్ని, పని పట్ల గౌరవాన్ని, బాధ్యతను బోధిస్తుందని నమ్ముతుంది. స్కూలును శుభ్రపరిచే పనిలో అందరూ పాలు పంచుకుంటే ఒకరికొకరు సహాయం చేసుకునే గుణం అలవడుతుందని, పిల్లలంతా పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ పనిచేస్తారు కాబట్టి తాము చేసే పని వారికి విసుగ్గా అనిపించదని నిర్వాహకుల అభిప్రాయం. పాఠశాలను శుభ్రపరుచుకోవడం దగ్గర నుంచి వంతుల వారీగా భోజనాలు వడ్డించడం, ప్లేట్లు కడగడం, పాలడబ్బాలను రీసైక్లింగ్ కోసం సిద్ధం చేయడం, పెద్దవాళ్ల సాయంతో వంట పాత్రలు కడగడం వరకూ అన్ని పనులూ పిల్లలే పూర్తి చేస్తారు. ఈ పనులు వాళ్లల్లో ఆత్మవిశ్వాసాన్ని పెంచుతాయని, పాఠశాలను చక్కదిద్దుకునే ఈ నేర్పే, తర్వాత కాలంలో తమ జీవితాల్ని చక్కదిద్దుకోవడానికి వారికి పనికి వస్తుందనేది విద్యావేత్తలు చెపుతారు.





‘కు’లమనేది ఎవడు పుట్టిచ్చిందో? వాని యాలి ముండమొయ్య. ఎవనికెవడూ కలవకుంట జేసింద్రు. ఎవని రక్తమైన ఎర్రగనే ఉంటది. గోదలకాడ్కి గోదలు పోతయి. గొర్లకాడికి గొర్లు పోతయిగని మనిషి కాడికి మనిషిని పోకుంట జేసింద్రురా .. బాపనిండ్లళ్ల బస్తోడు లేడా? మాదిగిండ్లల్ల

# కులవివక్షపై గురి ‘తప్ష’

మంచోడు లేడా? కులంతోటి ఏందిరా .. గుణం మంచిగుండాలె’ - ‘బోధ’ కథలో ఒక పాత్ర ద్వారా రచయిత వెలిబుచ్చిన అక్షర ముత్యాలివి. ఈ మాటలు చాలు కుల వివక్ష పట్ల రచయిత గుండె కొలిమిలో ఎంత ఆక్రోశం ఉందో అర్థం చేసుకోవడానికి. బిచ్చమెత్తుకునే పిల్లలను చేరదీసి వారికో మార్గం చూపిన హాస్టల్ వార్డన్ కథ ‘మార్పు’. కులాన్ని బట్టి పిలిచే పెండ్లి పిలుపులను మూకుమ్మడిగా బహిష్కరించి ఆత్మగౌరవంతో జీవించాలనుకునే మిత్రుల ఐకమత్యాన్ని చాటి చెప్పిన కథ ‘తప్ష’ (నిర్ణయం). అలాగే వర్గీకరణ ఆవశ్యకతను చెప్పిన కథ ‘పంచుకోండ్రి’. కథల్లోని ప్రాంతీయ పలుకుబళ్ల, అందమైన మెదక్ జిల్లా మాండలీకం చదువరికి కలకండ రుచిని అందిస్తాయి.

**- తహిరో**

**తప్ష** (కథలు), సిద్దెంకి యాదగిరి,
**పేజీలు :** 151, **వెల :** రూ.120
**ప్రతులకు:** 94412 44773

తెలుగునాట ఎన్నో కులాల చరిత్రను మౌఖికంగా గానం చేసే భట్టరాజుల కుల చరిత్రే డి. కేశవరాజు వేంకటరామరాజు రాసిన పరిశోధనాత్మక కథనం ‘భట్టరాజీయము’. భట్రాజు కులానికి సంబంధించిన అనేక ఆసక్తికరమైన చారిత్రక వివరాలను నమోదు చేసిన పుస్తకమిది. కుల చరిత్రను పౌరాణీకరించకుండా సాధ్యమైనంత వరకూ సాధారణీకరించేందుకు రచయిత చేసిన ప్రయత్నం

# పరిశోధనాత్మక కథనం

అభినందనీయం. క్షత్రియుల్లో సూర్యవంశ, చంద్రవంశాలన్నవి మూఢ విశ్వాసాలనీ, మానవుడి మూలపురుషులు మానవులే అనే సందేశాన్నిచ్చే ఈ పుస్తకంలో అనేక పదాల శబ్దార్థ వ్యుత్పత్తులూ, భట్టు కులానికి చెందిన ప్రతిభావంతుల, మంత్రుల వివరాలూ ఉన్నాయి. భాష సరళ వ్యవహారికంలో ఉంటే ఇది మరింత మందిని చదివించగలిగేది.




**- డి. లెనిన్**

**భట్ట రాజీయము** (భట్టరాజుల చరిత్ర),
డాక్టర్ కేశవరాజు వేంకట రామరాజు
**పేజీలు :** 360, **వెల :** రూ.200,
**ప్రతులకు :** ఆత్రేయ సాహిత్య సదనం, 040-24751429

## కొత్త పుస్తకాలు




సుమారు రెండు దశాబ్దాల అనంతరం అరణ్యకృష్ణ మళ్ళీ గొంతు విప్పాడు. ‘ఈ భూమి గర్భంలో/ మతాలకన్నా మనుషుల ఆనవాళ్ళే ఎక్కువ’ అంటూ ‘నెత్తురోడుతున్న పదచిత్రం’ను ఆవిష్కరించిన ఇరవై రెండేళ్ళ తర్వాత ‘కవిత్వంతో ఉన్నంతసేపూ...’ ‘వర్షంలో తడుస్తున్న భూమిలా/ నేనూ అమలినంగా ఉంటాను’ అని ప్రకటిస్తున్నాడు. ‘మనసుల మధ్య కూడా సరిహద్దుల నిర్ణయం/ అది రెండు దేశాల సరిహద్దు కన్నా పెద్దదే’ అంటూ ఆమె నిరాకరించినప్పుడు నో అంటే నో అని బల్లగుద్దినట్టు

# తడిసిన భూమిలాంటి కవిత్వం

చెబుతాడు. ‘గాయపడి నెత్తురోడడానికి పాపైనా బాబైనా ఒక్కటే’ అని ప్రస్తుతం సమాజంలో నెలకొంటున్న అసహజాతాన్ని ఈసడించుకుంటాడు. అర్థం కాని నిగూఢత గాని, అంతులేని పదచిత్రాల ప్రదర్శన గాని ఈ కవిత్వంలో ఎక్కడా మచ్చుకైనా కనిపించవు. చెప్పాలనుకున్న దాన్ని సూటిగానే చెబుతాడు. అందుకే ‘ఈ వ్యవస్థే కాదు/ మనుషులందరూ కూడా హఠాత్తుగా చచ్చిపోయి/ కొత్త మనుషులు పుట్టుకొస్తే బాగుండు’ అంటూ ఒక మంచి కల కంటున్నాడు. ఆ కల నెరవేరాలని కోరుకుందాం.

**- దేరా**

**కవిత్వంలో ఉన్నంతసేపూ** , అరణ్యకృష్ణ
**పేజీలు :** 127 **వెల :** రూ. 80
**ప్రతులకు :** 89787 20164

## ఇవీ వచ్చాయి

**ఎమ్మెస్వీ కథలు**
**రచన :** ఎమ్మెస్వీ గంగరాజు
**పేజీలు :** 224., **వెల :** రూ.100

**నువ్వు కడలివైతే...**
**రచన :** నండూరి సుందరీనాగమణి
**పేజీలు :** 192, **వెల :** రూ.150

**రెప్పపాటు ప్రయాణం**
**రచన :** పోలంరాజు శారద
**పేజీలు :** 252, **వెల :** రూ.150

**అనుబంధాల టెక్నాలజీ**
(కథా సంపుటి)
**రచన :** డా. లక్ష్మీరాఘవ
**పేజీలు :** 200, **వెల :** రూ.100
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

**విమలారాణి కథలు**
**రచన :** కె. విమలారాణి
పేజీలు : 122, వెల : రూ.125
**ప్రతులకు :** 90009 38291

**బతుకే బంగారం**
(కథల సంపుటి)
**రచన :** దేవరాజు రవి, సీత
**పేజీలు :** 104., **వెల :** రూ.80

**సుందరి సుబ్రహ్మణ్యం**
(నవ్వుల కథలు) మొదటి భాగం
**రచన :** సి.ఎస్. నాగేశ్వరరావు
సి.ఎల్. రాజకుమారి
**పేజీలు :** 126., **వెల :** రూ.100
**ప్రతులకు :** విశాలాంధ్ర, నవచేతన

**కమాను వీధి కథలు**
**రచన :** రామదుర్గం మధుసూదనరావు
**పేజీలు :** 160, **వెల :** రూ.120
**ప్రతులకు :** 99121 99557

# పైల్స్‌కు పక్కా వైద్యం

**మ**లద్వారంలో వచ్చే ఒక ప్రధాన సమస్య పైల్స్. ఈ మధ్యకాలంలో ఎక్కువ మంది పైల్స్ సమస్యతో బాధపడుతున్నారు. పీచుపదార్థం లేని ఆహార పదార్థాలు తీసుకోవడం, ఎక్కువ గంటలు కదలకుండా కూర్చోవడం, మాంసాహారం అతిగా తీసుకోవడం వంటివి పైల్స్ సమస్య రావడానికి కారణంగా చెప్పుకోవచ్చు. ఇకపోతే గర్భిణీ వల్ల ఏర్పడే భారం వల్ల కూడా కొంతమంది స్త్రీలలో ఈ సమస్య తలెత్తే అవకాశం ఉంది. మొత్తంగా చూస్తే మలబద్దకం ఈ సమస్యకు ప్రధానంగా కారణంగా ఉంటుంది. గట్టిపడిన మలాన్ని విసర్జించే ప్రయత్నంలో ఎక్కువ మంది గట్టిగా ముక్కుతుంటారు ఈ స్థితిలో అక్కడున్న సూక్ష్మరక్తనాళాలు అంటే సిరలు, లేదా దమనలు ఒత్తిడికి గురై మలద్వారం వద్ద ముద్దగా తయారవుతాయి. ఈ ముద్దలే విసర్జనకు పెద్ద అంతరాయంగా మారతాయి. అయితే కొందరిలో పుట్టుకతోనే మలద్వారం వద్ద ఉండే సూక్ష్మ రక్తనాళాలు, కండరాలు బలహీనంగా ఉంటాయి. ఇవే అంతిమంగా పైల్స్ సమస్యకు దారి తీస్తాయి.

### హోమియో చికిత్స

పైల్స్ సమస్యకు సర్జరీ పరిష్కారం చూపుతుందని అనుకుంటారు. కానీ ఆ ఉపశమనం కొద్దిరోజులే ఉంటుంది. కొద్దిరోజుల్లోనే పైల్స్ సమస్య మళ్లీ మామూలు అవుతుంది. అయితే హోమియో మందులతో సర్జరీ అవసరం లేకుండానే పైల్స్ శాశ్వతంగా పోతాయి. అనుభవజ్ఞులైన డాక్టర్ పర్యవేక్షణలో డాక్టర్ సూచించిన విధంగా క్రమం తప్పకుండా మందులు వాడితే పైల్స్ సమస్యను శాశ్వతంగా దూరం చేసుకోవచ్చు.

# హెర్పిస్ శాశ్వతంగా పోవాలంటే..!

**హెర్పిస్**కు కారణం హెచ్ఎస్‌వి(హెర్పిస్ సింప్లెక్స్ వైరస్). ఇది ఒకరకమైన వ్యాప్తి చెందే వ్యాధి. ముఖ్యంగా నోరు, పెదాలు, నాలుక, జననాంగాలలో వచ్చే వ్యాధి ఇది. నోటిలో వచ్చే వ్యాధిని ఓరల్ హెర్పిస్ అంటారు. బుగ్గలపై, ముఖంపై రావచ్చు. జననాంగాలపై వచ్చే వ్యాధిని జెనెటల్ హెర్పిస్ అంటారు. ఇందులో రెండు రకాలుంటాయి. ఒకటి హెచ్ఎస్‌వి 1, రెండోది హెచ్ఎస్‌వి2.

**హెచ్ఎస్‌వీ 1 :** తినే పాత్రల ద్వారా, లిప్ బామ్‌లు ఇతరులవి ఉపయోగించడం ద్వారా, ముద్దుల ద్వారావ్యాప్తి చెందుతుంది.

**హెచ్ఎస్‌వీ2 :** సెక్స్ ద్వారా వ్యాపిస్తుంది. జననావయవాల దగ్గర పొక్కుల మాదిరిగా వచ్చి పగిలిపోతూ ఉంటాయి. తగ్గినట్టే తగ్గి తిరిగి రావడం జరుగుతుంది. లైంగిక వ్యాధులలో నిత్యం వేధించే ఈ సమస్య దైనందిన జీవితాన్ని దుర్భరం చేస్తుంది.

**లక్షణాలు :** నోట్లో, నాలుకపై, పెదవులపై, బుగ్గలపై, ముఖంపై పొక్కులుంటాయి. జననాంగాల వద్ద కురుపులు, మూత్రవిసర్జన సమయంలో నొప్పి, మంట, జననేంద్రియాల దగ్గర దురద, మంట, జ్వరం, ఒళ్లునొప్పులు, నీరసం, ఆకలి లేకపోవడం, తలనొప్పి, బిళ్లలు కట్టడం, మలబద్ధకం, బరువు తగ్గడం, మానసిక ఆందోళన వంటి లక్షణాలుంటాయి.

### హోమియో చికిత్స

హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. సాధారణంగా హెర్పిస్ తగ్గినట్టే తగ్గి మళ్లీ వస్తుంది. అయితే హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టడం ఉండదు.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



# సంతానసాఫల్యానికి నమ్మకమైన మార్గం

**సం**తానలేమికి చాలా కారణాలుంటాయి. అయితే సంతానం కలగడం లేదు, ఎంత మంది డాక్టర్లకు చూపించినా ఫలితం లేదని ఉండకుండా హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా మెరుగైన ఫలితాలు పొందవచ్చు. పురుషుల్లో సంతానలేమికి కారణాలు కనుక్కుని చికిత్స ఇస్తే సంతానం కలిగే అవకాశాలు మెరుగవుతాయి. పురుషుల్లో సంతానలేమికి ఇవి కారణం కావచ్చు.

**అజూస్పెర్మియా :** వీర్యంలో వీర్యకణాలు అసలు లేకపోవడాన్ని అజూస్పెర్మియా అంటారు. హార్మోనల్ అసమతుల్యతనే కాకుండా ఇతర అనేక కారణాల వల్ల ఈ సమస్య ఉత్పన్నమవుతుంది.

**అలిగోస్పెర్మియా :** పురుషుల్లో వీర్యకణాల సంఖ్య తక్కువగా ఉండటాన్ని అలిగోస్పెర్మియా అంటారు. వైరల్ ఇన్‌ఫెక్షన్లు ఇందుకు కారణం కావచ్చు. అధిక ఉష్ణోగ్రత దగ్గర పనిచేయడం కావచ్చు.

**అస్థినోస్పెర్మియా :** వీర్యకణాల మోర్టాలిటీ తక్కువగా ఉంటుంది. ఇన్‌ఫెక్షన్లు రావడంతో ఈ సమస్య తలెత్తుతుంది. ఈ ఇన్‌ఫెక్షన్లు తగ్గాలంటే దంపతులు ఇద్దరూ మందులు వాడాల్సి ఉంటుంది.

**పుట్టుకతో లోపాలు :** వృషణాలు అభివృద్ధి చెందకపోవడం, దెబ్బలు తగలడం వల్ల కూడా సంతానలేమి ఎదురుకావచ్చు.

**చికిత్స :** సంతానలేమి సమస్యకు హోమియోలో చక్కటి వైద్యం అందుబాటులో ఉంది హోమియో వైద్యవిధానంలో మనిషిలోని శారీరక ధర్మాలను, మానసిక లక్షణాలను పరిగణలోకి తీసుకుని మందులను అందించడం జరుగుతుంది. మానసిక ఒత్తిడి, ఆందోళన, హార్మోన్లలోపం ఉన్నట్లయితే దానికి తగిన చికిత్సను ఇవ్వడం, హార్మోన్ల ఉత్పత్తిని ప్రేరేపించే మందులను ఇవ్వడం ద్వారా సమస్యను తగ్గించి, సంతానం కలిగేలా చేయడం జరుగుతుంది.

# హెపటైటిస్‌ను అడ్డుకునే చికిత్స

**ప్ర**పంచ ఆరోగ్య సంస్థ లెక్కల ప్రకారం ప్రతి ఏటా 6 నుంచి 10 లక్షల మంది హెపటైటిస్ బి, సి వ్యాధుల వల్ల మృత్యువాత పడుతున్నారు. హెపటైటిస్ బి, సి రాకుండా వ్యాక్సినేషన్ ఉన్నప్పటికీ, ఈ వ్యాధి వచ్చిన తర్వాత హోమియోలో మేలైన చికిత్స ఉంది. హెపటైటిస్ బి, సి వ్యాధులు చాలా ప్రమాదకరమైనవి. ఇవి ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తాయో అప్పుడు తీవ్ర పరిణామాలు ఎదుర్కోవలసి వస్తుంది. అంతవరకు ఈ వ్యాధులు సోకాయో లేదో అన్న విషయం రోగికి కూడా తెలియదు. రక్తపరీక్ష చేసినపుడో లేదా శస్త్ర చికిత్స చేసే ముందో ఈ వ్యాధులు సోకినట్లు హఠాత్తుగా బయటపడుతుంది.

**లక్షణాలు :** హెపటైటిస్ బి వ్యాధి బయటపడటం చాలా ఆలస్యంగా జరుగుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత కూడా వ్యాధి బయటపడవచ్చు. వైరస్‌కి పరిసరాలు సహకరించేంతవరకు అది వేచి ఉంటుంది. ఆ తర్వాతే అది దాడి చేస్తుంది. వాంతి వచ్చినట్లుగా వికారంగా ఉండటం, వాంతులు రావడం. ఆకలి వేయక పోవడం, ఆహారం సహించకపోవడం. మూత్రం పసుపు రంగుతో, కళ్లు పచ్చగా ఉండటం ఉండటం. ఆర్థరీస్ వాచిపోవడం, కిడ్నీకి సంబంధించిన సమస్యలు, ప్లేట్‌లెట్స్ కౌంట్ పడిపోవడం, తలనొప్పి,రక్తకణాల సంఖ్య క్రమంగా పడిపోవడం జరుగుతుంది. కొన్ని సార్లు లివర్ కేన్సర్‌కు కూడా దారితీస్తుంది.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వైరస్‌లు కాలేయంలో మల్టిపుల్ అయ్యే అవకాశం ఎక్కువగా ఉంటుంది. దీన్ని రెప్లికేషన్ అంటారు. ఈ రెప్లికేషన్ అయ్యే పద్ధతిని హోమియోపతి మందుల ద్వారా సంపూర్ణంగా అడ్డుకోవచ్చు. పెరిగిన వైరల్ లోడ్‌ను మన రోగనిరోధక వ్యవస్థ ద్వారా సమర్థంగా అడ్డుకోవడంలో సహకరిస్తుంది. ఉన్న వైరస్‌ను పెరగకుండా చూస్తుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం లభిస్తుంది.

ADVT

